PARLE

# మరవద్దు ఆ 'జీ' తత్వం ఎప్పుడూ మనం... జీవితాంతం

## జీవిత పరమార్థం ఇదేలే ఇదే

జీవితంలోని యీ దారుల్లో వేసే ప్రతి అడుగూ పరీక్షే నిజానికి. ఏ దారుల్ని అనుసరిస్తాం, వేటినుంచి విముఖలమౌతాం అనేదే మన వ్యక్తిత్వానికి గుర్తు. ఏదీ కోరకుండా, ఏమీ ఆశించకుండా, ఎవరికైనా తోడ్పడటం. నిజానికి నిజాయితీగా బతకడం అంటే యిదే. మరవద్దు ఆ 'జీ' తత్వం మనం... ఎప్పుడూ మనం, జీవిత పరమార్థం ఇదేలే ఇదే. ఏళ్ళతరబడిగా భారతదేశంలో అన్నింటికన్న ఎక్కువగా కోరుకుంటూన్న బిస్కట్.




• రుచికరం, నిజంగా శక్తిమయం. •

everest/95/PPL/110tl

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి :

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా:

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 129.00 ఎయిర్‌మెయిల్ ద్వారా: రూ. 276.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 135.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 276.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని క్రింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి



## విద్యాబోధనలో ఉన్నత ప్రమాణాలు

సెలవుల తరవాత పాఠశాలలు, కళాశాలలు తెరవడంతో మరొక విద్యాసంవత్సరం ప్రారంభమయింది. సంవత్సరానికి సంవత్సరం విద్యార్థుల సంఖ్య పెరుగుతూనేఉన్నది. బెంగళూరులోని 'ఇండియన్ అకాడెమీ ఆఫ్ సైన్సెస్' నివేదిక ప్రకారం పదేళ్ళ క్రితం మనదేశంలో బడికి వెళ్ళే పిల్లల సంఖ్య 120,000 మంది. అది ఏడాదికి 3 శాతం ప్రకారం పెరుగుతూ వస్తున్నది. అయితే, పెరుగుతూన్న విద్యార్థుల సంఖ్యకు, పాఠశాలలకు తగిన విధంగా అక్కడి వసతులు పెరుగుతున్నాయా? అంటే లేదనే చెప్పాలి.

నగరాలలోనూ, పట్టణాలలోనూ ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలు నడిపే కొన్ని పాఠశాలలలో తప్ప మిగిలిన పాఠశాలల స్థితి అంతంత మాత్రంగానే ఉన్నది. ఇటీవలి కాలంలో కొన్ని ప్రైవేటు సంస్థలకు కూడా పాఠశాలలు ధనం ఆర్జించి పెట్టే 'పరిశ్రమలు'గా మారుతున్నాయే తప్ప, అక్కడి వసతులు పెరగలేదు. ఆ విద్యా సంస్థలను నడిపే యజమానులూ డబ్బును గురించి తప్ప, విద్యార్థుల భవిష్యత్తును గురించి ఆలోచించడం లేదు. ఎందుకంటే, మన దేశంలోని దాదాపు 60 శాతం పాఠశాలలలో ముఖ్య అవసరమైన నల్లబల్లలు కూడా లేవు. ఇక గ్రంథాలయాల, ప్రయోగశాలల సంగతి సరేసరి!

ఈ పరిస్థితి పాఠశాలలకే పరిమితం కాదు. 'ఉన్నత' విద్యానిలయాలయిన కళాశాలల పరిస్థితి కూడా ఇంచుమించు ఇలాగే ఉన్నది. నలభై సంవత్సరాల క్రితం, విద్యార్థులలో 30-32 శాతం మంది సైన్సు ప్రధాన పాఠ్యాంశంగా చదివే వారు. ఇప్పుడది 19-20 శాతానికి తగ్గింది. కళాశాలలలో సైన్సు విద్యాభ్యాసానికి తగిన వసతులు లేక పోవడం కూడా దీనికి ఒక కారణంగా చెప్పవచ్చు.

రోజురోజుకూ వస్తూన్న మార్పులకు అనుగుణంగా, భావిపౌరులకు ఉన్నత ప్రమాణాలతో విద్య నేర్పడానికి వీలుగా మనదేశ విద్యావిధానాలను తీర్చిదిద్ది, వసతులను కల్పించి, పెంపొందించడం చాలా అవసరం!



సంపుటి : 99 జూలై'96 సంచిక : 1

విడిప్రతి : 6.00 సంవత్సర చందా : 72.00



వార్తలు - విశేషాలు:

# నూతన ప్రధానమంత్రి

ఏప్రిల్, మే నెలలలో మన లోక్‌సభ 543 స్థానాలకూ; అస్సాం, హర్యానా, కేరళ, తమిళ నాడు, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలకూ; కేంద్ర పాలిత ప్రాంతమైన పాండిచ్చేరి శాసన సభకూ కలిసి మొత్తం 914 శాసన సభ స్థానాలకు ఎన్నికలు జరిగాయి. అక్కడక్కడ చెదురు మదురు సంఘటనలు తప్ప ఎన్నికలు ప్రశాం తంగానే జరిగాయి. నాలుగు రాష్ట్రా లలోనూ, పాండిచ్చేరిలోనూ పాలక పక్షాలు ఓటమి పాలయ్యాయి. పశ్చిమ బెంగాల్లో మాత్రం పాలక పక్షమైన లెఫ్ట్‌ఫ్రంట్ మళ్ళీ అధికారం లోకి వచ్చింది.



కేంద్రంలో కూడా ప్రభుత్వం మారింది. పాలక పక్షమైన కాంగ్రెస్ 140 స్థానాలు మాత్రమే గెలుచుకో గలిగింది. భారతీయ జనతా పార్టీకి కాంగ్రెస్ కన్నా 21 స్థానాలు ఎక్కువ లభించాయి. అయినప్పటికీ, ప్రభుత్వం ఏర్పాటుచేయడానికి అవసరమైన స్థానాలు దానికి లభించలేదు. ఏ ఒక్క పార్టీకి గాని పూర్తి మెజారిటీ లేని 'హంగ్' పార్లమెంటు ఏర్పడింది.

ఈ లోక్‌సభ ఎన్నికలలో జనతాదళ్‌కు 46 స్థానాలూ, ఉభయ కమ్యూనిస్టు పార్టీలకు 44 స్థానాలూ లభించాయి. 17 ప్రాంతీయ పార్టీలూ, ఇండిపెండింట్లు కలిసి 153 స్థానాలు గెలుచు కున్నాయి.

భారతీయ జనతాపార్టీకి కొన్ని ప్రాంతీయ పార్టీలు మద్దతు తెలియజేయడంతో, ఎక్కువ మంది సభ్యులు గల ఆ పార్టీని ప్రభుత్వం ఏర్పాటు చేయవలసిందిగా – ఆ పార్టీ, లోక్‌సభ నాయకుడు అటల్ బిహారీ వాజ్‌పాయ్‌ని రాష్ట్రపతి ఆహ్వానించాడు. మే 15వ తేదీ భారతీయ జనతాపార్టీ ప్రభుత్వం ఏర్పాటయింది. కాని, రాష్ట్రపతి ఇచ్చిన గడువులోగా మెజారిటీ నిరూపించుకోలేక పోవడంతో, భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం 13 రోజులలో రాజీనామా చేసింది.

ఆ తరవాత ప్రభుత్వం ఏర్పాటు చేయడం- జనతాదళ్, వామ పక్షాలు, ప్రధాన ప్రాంతీయ పార్టీలు కలిసి ఏర్పడిన యునైటెడ్ ఫ్రంట్ వంతయింది. కర్నాటక రాష్ట్ర జనతాదళ్ ముఖ్యమంత్రి అయిన శ్రీ హెచ్.డి. దేవెగౌడను - జనతాదళ్, తమ నాయకుడిగా ఎన్నుకోవడంతో ఆయన మన దేశానికి 12వ ప్రధానమంత్రిగా జూన్ 1వ తేదీ పదవీప్రమాణం చేశారు. పదకొండు పార్టీల సంకీర్ణ ప్రభుత్వానికి ఆయన నాయకత్వం వహిస్తున్నారు.

శ్రీ దేవెగౌడ 1933వ సం॥లో కర్నాటక రాష్ట్రంలోని ఒక మారు మూల గ్రామం రైతుకుటుంబంలో పుట్టారు. సివిల్ ఇంజనీరింగ్‌లో డిప్లొమా పొంది కొన్నేళ్లు సివిల్ కాంట్రాక్టర్‌గా పనిచేశారు.

ఆ తరవాత ఆయన రాజకీయ రంగంలో ప్రవేశించి, అంచెలంచెలుగా ఎదిగి 1962వ సం॥లో కాంగ్రెస్ పార్టీ శాసన సభ్యుడయ్యారు. 1983వ సం॥లో కర్నాటకలో ఏర్పడిన మొట్టమొదటి కాంగ్రెసేతర ప్రభుత్వంలో మంత్రి అయ్యారు. 1991వ సం॥లో సమాజ్‌వాది పార్టీ అభ్యర్థిగా హసన్ నుంచి పార్లమెంటుకు ఎన్ని కయ్యారు. 1994వ సం॥లో జరిగిన ఎన్నికలలో జనతాదళ్‌కు నాయకత్వం వహించి, కర్నాటక ముఖ్యమంత్రి అయ్యారు. ఆ పదవిలో 17నెలల పాటు కొనసాగి, ఇప్పుడు యునైటెడ్‌ఫ్రంట్ ఆదేశం మేరకు భారత దేశ ప్రధాన మంత్రి పదవిని చేపట్టారు.



# విశ్వంభరన్యాయం

నిత్యమల్లెపురంలో గోవిందుడనే భూస్వామి ఉన్నాడు. ఆయనకు పెద్ద మేడ వుంది. బోలెడు పొలాలున్నాయి. పట్టిందల్లా బంగార మవుతూంటుంది. అంతా ఆయనను అదృష్ట వంతుడని అంటూంటారు.

కొంతకాలానికి ఆ ఊరికి గోపాలుడనే ఆసామీ వచ్చాడు. ఆయనకు ఆస్తి లేదుకానీ, విద్యాధికుడు. అపారమైన తెలివి ఉంది. నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుందనే సామెత తెలుసో ఏమో వచ్చిన నెలరోజుల్లోనే అందరి మధ్యా ఎంతో మంచిపేరు తెచ్చుకున్నాడు. అయితే, గోవిందుణ్ణి మాత్రం ఆయన చూడలేదు.

గోవిందుడికి ఆ నోటా ఈ నోటా గోపాలుడి గురించి వార్తలందుతూనే ఉన్నాయి. ఆయన తన వద్దకు రాకపోవడం చిన్నతనంగా తోచినా, ఒకరోజున కబురు పెట్టి మరీ తన వద్దకు రప్పించుకున్నాడు. "ఏదో ఒక రోజున నేనే మీ వద్దకు వద్దామనుకుంటు న్నాను. ఈలోగా మీరే పిలిచారు కారణమే మిటి?" అన్నాడు గోపాలుడు.

"మీరు డబ్బు ఇబ్బందుల్లో ఉన్నారని తెలిసింది. ఆత్మాభిమానం ఉన్నవాళ్ళు నోరు తెరిచి అడగరుకదా! ఆత్మీయతను కోరే వాడిగా నేను మీకో సాయం చేద్దామను కుంటున్నాను. నా డబ్బు తీసుకుంటే, మీకు నా అదృష్టం అంటి, అచ్చి వస్తుంది," అని చెప్పాడు గోవిందుడు.

గోపాలు డాయనకు రెండు చేతులూ జోడించి నమస్కరించి, "ఆత్మీయుడిలా మాట్లాడారు. ఎంతో సంతోషంగా ఉన్నది. ఇక మీదట మనం ఒకరినొకరు మాటలతో మన్నించుకోవద్దు. నువ్వనుకుందాం," అన్నాడు.

గోవిందుడు తలూపాక, "నేను నా అదృష్టంతోనే పైకి రావాలని కోరుకునే

"వసుంధర"

మనిషిని. కాబట్టి నీ డబ్బును తీసుకోను. మనం మాత్రం డబ్బు ప్రసక్తి లేకుండా, ఇప్పటిలాగే, ఆత్మీయుల్లా ఉందాం," అన్నాడు గోపాలుడు.

అందుకు సరేనన్నాడు గోవిందుడు.

మొదట గోపాలుడు తన కుటుంబంతో సహా అద్దె ఇంట్లో దిగాడు. రెండు సంవత్సరాలు గడిచేసరికిసొంతఇల్లుకొన్నాడు. ఇంకొక రెండేళ్ళలో అయిదెకరాల పొలం కొన్నాడు. క్రమంగా డబ్బు పోగు చేశాడు. పదేళ్ళు గడిచేసరికి గోవిందుడికి సాటి వచ్చేటంత ధనవంతుడయ్యాడు.

తనకే శుభం జరిగినా గోపాలుడు గోవిందుడికి చెబుతూండేవాడు. ఆయన వినిఊరుకునేవాడు తప్ప సంతోషం వెలిబుచ్చేవాడు కాదు. ఒకవేళ గోపాలుడు తనకంటే అదృష్టవంతుడిననుకుంటున్నాడేమో అన్న అనుమానంతో తనకు జరగని శుభాలు కల్పించి చెప్పేవాడు. వాటిని విని, గోపాలుడు బ్రహ్మానందపడేవాడు.

గోపాలుడు తరచుగా దూరప్రాంతాలకు వెళ్ళి పండిత సభలలో పాల్గొని డబ్బు సంపాదించేవాడు. ఆయన అఖండమైన పండితుడు కావడంతో, నానాటికీ ఆయన ఆదాయం పెరగసాగింది. తన గురించి అట్టే ఎక్కువగా చెప్పుకునే అలవాటు గోపాలుడికి లేదు. అందువల్ల, ఆయన సంపాదన గురించి అందరూ తలొకరకంగా చెప్పుకునేవారు. వీలున్నంతవరకూ గోవిందుడు కూడా గోపాలుడి గురించి చెడుగా అనేవాడు. ఇలా ఉండగా – ఒకరోజున నిత్యమల్లెపురానికి రాజదూత వచ్చాడు.



గోపాలుడిని మహాపండితుడుగా గుర్తించి, సన్మానం చేయాలనుకుంటున్నాడు రాజు. వారంరోజుల్లో బోయీలు బంగారు పల్లకితో రానున్నారు.

ఈ వార్త ఊరంతా పెద్ద విశేషంగా చెప్పుకున్నారు. ఒక్కసారిగా ఊళ్ళో గోపాలుడికి గౌరవం పెరిగింది. ఆయన స్వయంగా ఈ శుభవార్తను గోవిందుడికి చెప్పాడు. ఆయన ముఖం మాడ్చుకుని, "నాకు తలనొప్పిగా ఉంది!" అని లోపలిగదిలోకి వెళ్ళిపోయాడు. ఆయన ప్రవర్తనకు గోపాలుడు కాస్త ఆశ్చర్యపడినా, అది తనకు కొత్త కాదు కాబట్టి, గోవిందుడి స్వభావం అంతేలే అని సరిపెట్టుకున్నాడు.

బంగారు పల్లకి వచ్చిన రోజున, ఊరందరూ గోపాలుణ్ణి పొలిమేర దాకా



సాగనంపారు. గోవిందుడు అస్వస్థతగా ఉందని వెళ్ళలేదు.

రాజధానిలో గోపాలుడికి ఘన సన్మానం జరిగింది. రాజాయనతో, "అయ్యా! నిత్య మల్లెపురానికి ఇంతవరకు గ్రామాధికారి లేడు. పక్కవూరి అధికారే, రెండు ఊళ్ళ వ్యవహారాలు చూస్తున్నాడు. ఇకమీదట ఆ ఊరికి మీరే అధికారి," అన్నాడు.

గోపాలుడు తల అడ్డంగా ఊపి, "మహా ప్రభూ! పాండిత్యం వేరు, పాలనా సామర్థ్యం వేరు. నిత్యమల్లెపురంలో నా ప్రియ మిత్రుడు గోవిందుడున్నాడు. ఆయన సమర్థుడే కాక, అదృష్టవంతుడు కూడా. ఆయన పాలనలో ప్రజలు సుఖపడతారు. ఆయన అదృష్ట వంతుడు గనక ఊరుకు అదృష్టమూ కలి సొస్తుంది," అన్నాడు.

రాజు దీనికి ఒప్పుకుని, వెంటనే పత్రం రాయించి, గోపాలుడినే స్వయంగా మిత్రుడి కంద జేయమన్నాడు.

ఈవార్త గోపాలుడికంటే ముందుగా నిత్య మల్లెపురం చేరింది. ఊరివాళ్ళు గోపాలుడి నిస్వార్థపరత్వాన్ని మెచ్చుకున్నారు. అయితే కొందరు మాత్రం, "గోవిందుడు మనిషి మంచివాడే కానీ, నోటి దురుసెక్కువ. గోపాలుడే అధికారి అయ్యుంటే బాగుండేది," అను కున్నారు.

ఏది ఏమైతేనేం, గోపాలుడు రాజధాని నుంచి తిరిగివచ్చి, గోవిందుడికి రాజసందేశా న్నందజేసి, "నా మిత్రుడు గ్రామాధికారి అయినందుకు నాకెంతో సంతోషంగా ఉంది," అని చెప్పాడు.

అప్పుడు మాత్రం గోవిందుడు మొదటి సారిగా, గోపాలుడికి కృతజ్ఞతలు తెలియ బరిచాడు.

రాజుకు గోపాలుడి పాండిత్యం పట్ల రోజురోజుకూ ఆకర్షణ పెరగసాగింది. ఆయన తరచుగా గోపాలుణ్ణి రాజధానికి రప్పిం చుకునేవాడు. వెళ్ళినప్పుడల్లా గోపాలుడు గ్రామస్థుల సమస్యలేమైనా ఉంటే, రాజుకు చెప్పేవాడు. ఆయన వెంటనే వాటికి పరిష్కార మార్గం చూపేవాడు. ఈ వార్త మోసుకుని, సంతోషంగా గోవిందుడికి చేరవేస్తే, ఆయన గోపాలుడి వంక గుర్రుగా చూసి, "గ్రామ సమ స్యలు రాజుకు నువ్వెందుకు చెప్పాలి? ఈ గ్రామానికి నువ్వా, నేనా అధికారిని? సరే, జరిగిందేదో జరిగిపోయింది. మరొక సారి నువ్విలా చేస్తే, నేను నా పదవిని విడిచి పెట్టేస్తాను," అన్నాడు.

"ఎవరివల్లనయితేనేం, ఊరుకు మేలు జరిగితే అధికారి సంతోషించాలి కదా! నువ్వు కూడా నన్నుపయోగించుకుని, నీ అవసరాలు రాజు నుంచి తీర్చుకో," అని గోపాలుడు, గోవిందుడికి నచ్చజెప్పాలని చూశాడు.

అయితే గోవిందుడు మాత్రం పట్టుదలగా, "నేను గ్రామాధికారిని. గ్రామం బాగోగులు నేను చూసుకుంటాను. నువ్వు రాజువద్ద పాండిత్యం తప్ప మరే విషయాలూ ప్రస్తావించకు. ఇది నా ఆజ్ఞ!" అన్నాడు.

గోవిందుడిలో పదవి కారణంగా అహం పెరిగిందని గ్రహించినా, ఆయన మాటల్లో కొంతవరకు నిజం ఉన్నదనిపించింది గోపాలుడికి.

క్రమంగా గోవిందుడికి, గోపాలుడి పట్ల అసహనం పెరగసాగింది. పొలంపన్ను కట్టలేదనో, ఇంటిపాక చూరు వీధిలోకి వచ్చిందనో లేని కారణాలు చెప్పి గోపాలుణ్ణి వేధించసాగాడు.

గోపాలుడు కొంత కాలం సహించాడు. చివరకు విసిగిపోయి, రాజుకు ఫిర్యాదు చేశాడు. రాజు, గోవిందుణ్ణి గట్టిగా మందలించాడు. గోవిందుడు సరైన సంజాయిషీ ఇచ్చుకోలేక గోపాలుడి పట్ల మరింత ఉక్రోషం పెంచుకున్నాడు.

ఇలాంటి సమయంలో, ఆ ఊరికి విశ్వంభరుడనే సాధువు వచ్చాడు. ఆయన హిమాలయాల్లో కొంత కాలం తపస్సు చేసి, కొన్ని శక్తులు సంపాదించాడు. వారానికొక్కరోజు పదిమందికి కోరినది జరిగేలా చేస్తాడాయన. గోవిందుడాయనకు తన ఇంట్లో ఆశ్రయం ఇచ్చాడు.

ప్రతిరోజూ గ్రామస్థులు వచ్చి, విశ్వంభరుణ్ణి దర్శించుకుని, తమ సమస్యలు చెప్పుకునేవారు. ఆయన వాళ్ళు చెప్పింది శ్రద్ధగా





విని, వారిలో కొందరిని ఎన్నుకుని, వారంలో ఒకరోజున కోర్కెలు తీర్చేవాడు. గోవిందు డింటిలో ఉన్న కారణంగా, ప్రతివారం ఆయన గోవిందుణ్ణి తప్పకుండా ఎన్నుకునే వాడు.

ఈ అవకాశం తీసుకుని గోవిందుడు, తనపై రాజుకు అభిమానం కలగాలనీ, రాజు తను చెప్పినట్లు వినాలనీ కోరుకున్నాడు. ఆ ప్రకారమే జరిగింది. గోవిందుడు తరచుగా రాజును కలుసుకునేవాడు. మొదట్లో గోపా లుడికి వ్యతిరేకంగా చెప్పాలని చూశాడే కానీ, రాజు చెప్పుడుమాటలు వినడు. అందుకని ఆయన రాజుతో, "పండితుల అవసరాలు తక్కువ. సామాన్యుల అవసరాలు ఎక్కువ. తమరు కొంతకాలం పాటు పండితులను ఆదరించడం మాని, ప్రజాక్షేమాన్ని దృష్టిలో పుంచుకోవాలి," అంటూ నచ్చజెప్పాడు. ఫలితంగా ఎందరో పండితులతో పాటు గోపాలుడికి రాజునుంచి కానుకలు ఆగి పోయాయి.

గోపాలుడిలో దానగుణం ఎక్కువ. ఆయన వైభవంగా జీవిస్తూ పదిమందికి సాయ పడుతున్నాడు. రాజు నుంచి కానుక లాగిపోగానే, ఆయన సంపద కరిగిపోసాగింది. కొందరాయన పరిస్థితికి జాలిపడి, "విశ్వం భరుణ్ణి వేడుకోండి! మీకు మళ్ళీ రాజాదరణ లభిస్తుంది," అన్నారు. విశ్వంభరుడి శక్తి గురించి గోపాలుడు విని ఉన్నాడు. కానీ, ఆయనకు అద్భుతశక్తుల మీద నమ్మకం లేదు. అందువల్ల, తన బాధల గురించి చెప్పుకుందామని రాజధానికి వెళ్ళాడు. అయితే, ఆ సరికి రాజుకు గోవిందుడి మాటలు బాగా తలకెక్కి ఉన్నాయి. నిత్య మల్లెపురం గ్రామస్థులెవరైనా సరే, తమ సమస్యలను గోవిందుడి ద్వారా మాత్రమే తనకు చెప్పుకోవాలని, ఆయన భటులు చెప్పారు.

ఏం చేయాలో తెలియక గోపాలుడు, మంత్రిని కలుసుకుని మాట్లాడాడు.

గోపాలుడి విద్వత్తు కాయన ఆశ్చర్యపడి, "చెప్పండి. మీ కోసం ఏమైనా చేస్తాను," అన్నాడు.

గోపాలుడాయనకు ఒక సందేశాన్ని రాసి ఇచ్చి, "ఇది నేను రాసినట్లు రాజుకు చెప్ప వద్దు. పండితుల వల్ల సామాన్యుల కెంత ప్రయోజన ముంటుందో, పండితుల అవస రాలు తీర్చడం వల్ల రాజ్యానికెంత లాభ ముంటుందో ఇందులో రాశాను. మీరే

చెబుతున్నట్టుగా ఈ సందేశాన్ని రాజుకు వినిపించండి," అని తన గ్రామానికి వెళ్ళి పోయాడు.

మంత్రి చెప్పగా రాజా సందేశం విన్నాడు. ఆయనకు తన పొరబాటు అర్థమై - ప్రతి గ్రామానికీ ఒక రాజపండితుణ్ణి నియమించాలని నిర్ణయించుకున్నాడు. అందుకు పండితులు తమ వివరాలు పంపించవచ్చు. గ్రామాధికారి ద్వారా వివరాలు పంపిన పండితులకు ప్రాధాన్యత ఇవ్వబడుతుంది!

నిత్యమల్లెపురానికీ వార్త చేరింది. వెంటనే గోవిందుడు తనకు నచ్చినవాడి నెన్నుకొని, రాజుకు వాడి వివరాలు పంపాడు. ఇది తెలిసి గోపాలుడు, రాజుకు నేరుగా తన వివరాలు పంపాడు.

"రాజుకు తమరంటే ఎంతో ఇష్టం. కానీ, ఆయన పండితుల నియామకంలో కూడా, తమరిని సంప్రదించలేదు. 'ఏదో దుష్టశక్తి మీకు వ్యతిరేకంగా పనిచేస్తున్నది. తమరు విశ్వంభరుణ్ణి కలుసుకోక తప్పదు!" అని ఇష్టులు కొందరు గోపాలుడికి నచ్చ జెప్పారు.

ఏమనుకున్నాడో, గోపాలుడు విశ్వంభరుణ్ణి కలుసుకుని తన సమస్య చెప్పుకున్నాడు.

విశ్వంభరుడేదో అనేలోగా, అక్కడే వున్న గోవిందుడు, "స్వామీ! ఇతడికి తమపై విశ్వాసం లేదు. ఇంతవరకూ ఒక్కసారి కూడా తమరిని దర్శించలేదు. ఇప్పుడు స్వార్థంతో ఇక్కడికి వచ్చాడు," అన్నాడు.

"నా వద్దకు స్వార్థంతోనే అంతా వస్తారు. నాకు వ్యక్తులతోనూ, వారి సమస్యలతోనూ నిమిత్తం లేదు. న్యాయమైన కోర్కెలను తీర్చడం,



నా ధర్మం," అని, గోపాలుడితో, "నాయనా! ఎల్లుండి నువ్వు నా వద్దకు రావచ్చును," అన్నాడు విశ్వంభరుడు గంభీరంగా.

ఇది విని గోవిందుడు కళవెళ పడ్డాడు. అసలే గోపాలుడు తనను లెక్క చేయడు. ఇప్పుడు రాజపండితుడైతే తనను గుడ్డిగవ్వ కింద తీసి పారేస్తాడు. విశ్వంభరుడి దీవెనకు తిరుగుండదు. కాబట్టి అందుకు విరుగుడు ఆలోచించాలి!

గోపాలుణ్ణి, విశ్వంభరుడు దీవించే రోజు రానే వచ్చింది. ఆ రోజాయన గోపాలుడితో, "నాయనా! నీకేం కావాలో ఒకే ఒక్క కోరిక మనసులో కోరుకో. అది తప్పక ఫలిస్తుంది," అన్నాడు.

గోపాలుడు తనకు రాజపండితుడి పదవి కావాలని కోరుకున్నాడు. తర్వాత గోవిందుడు,

విశ్వంభరుడి దగ్గరకు వెళ్ళాడు. విశ్వంభరుడు, గోపాలుడికి చెప్పిన విధంగానే గోవిందుడికి చెప్పాడు. గోవిందుడు వెంటనే, "గోపాలుడికి రాజపండితుడి పదవి రాకూడదు," అని కోరుకున్నాడు.

అయితే, ఆయనకు మరుక్షణాన ఒక సందేహం కలిగి, విశ్వంభరుణ్ణి, "స్వామీ!పరస్పర విరుద్ధమైన కోర్కెలనొకే రోజున ఇద్దరు కోరితే, తమరెవరి కోర్కెను తీర్చుతారు?" అని అడిగాడు.

"ఎవరిదో ఒక్కరి కోర్కెనే తీర్చగలను. నా వల్ల ఎవరి కోర్కె తీరదో వారికి పతనం ప్రారంభమవుతుంది,"అన్నాడువిశ్వంభరుడు గంభీరంగా.

ఈ జవాబు విని గోవిందుడు చాలా సంతోషించాడు. పతనం గోపాలుడికే అనుకుని; మనసులో పొంగిపోయాడు. కానీ వారం రోజుల్లో రాజధాని నుంచి వార్త విని ఆయన హతాశుడయ్యాడు. గోపాలుడికి రాజపండితుడి పదవి లభించింది!

గోవిందుడు పరుగున వెళ్ళి విశ్వంభరుడితో, "స్వామీ! నా అదృష్టం తిరుగులేనిదని పేరు. తమరు నా ఇంట ఉండడంతో, అది రెట్టింపవుతుందనుకున్నాను. కానీ, ఇప్పుడు నాకు పతనం ప్రారంభమయ్యేలా ఉంది. ఇలా ఎందుకు జరిగింది?" అని కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు.

విశ్వంభరుడు నవ్వి, "నువ్వు అదృష్ట జాతకుడివి. సందేహం లేదు. నీ గురించి నువ్వు ఆలోచించినంత కాలం, నీ సుఖం నువ్వు కోరుకున్నంత కాలం, నీ అదృష్టానికి తిరుగులేదు. ఇతరులను కష్టపెట్టి,ఇతరులకు నష్టం కలిగించడంలో నీ సుఖం చూసుకున్న క్షణం నుంచి, నీ అదృష్టం కరిగిపోయి పతనం ప్రారంభమవుతుంది. నన్ను గోపాలుడు తన కోసంకోరుకున్నాడు. నువ్వు నీ కోసం ఏమీ అడక్క, గోపాలుడికి నష్టం కలిగించాలని కోరుకున్నావు. అందుకే నీ కోర్కె తీరలేదు. నీ పతనాన్ని అరికట్టడం నీచేతుల్లోనే ఉంది. ఉపకారికి అపకారం చేయాలనే, నీ బుద్ధినిమార్చుకో!" అన్నాడు.

అప్పటికి గోవిందుడికి కళ్ళు తెరుచుకున్నాయి. ఆయన గోపాలుడితో మిత్రభావంతో మెసలి కలకాలం మనశ్శాంతితో సుఖంగా జీవించాడు.






## 13

[రూపధరుడి జాడ ఏమీ తెలియనందున అతడు చనిపోయాడనుకుని అనేకమంది రాజకుమారులు రూపధరుడి ఇంట బసచేసి, రూపధరుడి భార్యను తమలో ఒకరిని పెళ్ళాడమని నిర్బంధించసాగారు. ఇది ఆమెకూ, ఆమె కుమారుడికీ భరించరాని వేదన కలిగించింది. పసివాడైన రూపధరుడి కుమారుడు ధీరమతి తన తండ్రి వార్తల కోసం ఒక నౌకలో బయలుదేరిపైలాస్‌కు నవద్యోతుణ్ణీ ప్రతాపుణ్ణీ చూడబోయాడు-తరవాత]

ఈ లోపల ఇథకాలో, రూపధరుడి ఇంట చేరిన యువకులు నిశ్చింతగా తింటున్నారు. తాగుతున్నారు. జూదాలాటతో కాలం వెళ్ళ బుచ్చుతున్నారు. ధీరమతి పైలాస్‌కు ప్రయాణమై వెళ్లిన సంగతి వారికి తెలియదు. ఇంటి బయట జూదాలాడుతున్న ఈ దుర్మార్గుల వద్దకు ఒక యువకుడు వచ్చి, దుర్బుద్ధి అనేవాడితో, "అయ్యా, పైలాస్ నుంచి ధీరమతి ఎప్పుడు తిరిగివస్తాడో తమకు తెలుసా? ఎందుకంటే అతను నా పడవ తీసుకువెళ్లాడు. నాకా పడవతో ఇప్పుడు ఒక ముఖ్యమైన పని వచ్చింది. నేను అవతలి ఒడ్డుకు పోయి ఒక అడవి గుర్రాన్ని తెచ్చుకుందామనుకుంటు న్నాను," అన్నాడు.

అందరూ ఒకరి మొహాలు ఒకరు చూసు కుని ఆశ్చర్యపోయారు.

దుర్బుద్ధి ఆ యువకుడితో, "ధీరమతి పైలాస్‌కు వెళ్లాడా? నీకు తెలియకుండా నీ పడవ కాజేశాడా? నిన్నడిగే తీసుకుపోయాడా? ఇదంతా ఎప్పుడు జరిగింది? ఆ పడవకు



దుమ్ముగొట్టి ఈ కుర్రకుంక పడవ చేసుకుని, నావికులను సమకూర్చుకుని వెళ్లిపోతాడా! శరవేగంతో వెళ్లే పడవ ఒకటి సంపాదించండి. ఇరవైమంది నావికులను పోగుచెయ్యండి: నేను ధీరమతి అంతు తేలుస్తాను," అన్నాడు ఆవేశంగా.

తరవాత నలుగురూ చేరి రహస్యాలోచన చేశారు. ధీరమతి పైలాస్ నుంచి తిరిగి వచ్చే దారిలో రహస్యంగా పొంచిఉండి, దుర్బుద్ధి అతన్ని చంపెయ్యాలని నిశ్చయించారు.

వాళ్లు చేసే కుట్రనుగురించి పద్మముఖికి నౌకర్లద్వారా తెలిసింది. తన ఇంట చేరిన దుర్మార్గులు తన కొడుకును చంపయత్నిస్తున్నారని వినేవరకు ఆమెకు ధీరమతి ప్రయాణమై వెళ్లిన సంగతే తెలియదు.

"ఇంతమంది నౌకర్లుండి నా కొడుకు సముద్రాలపై వెళ్లిపోతూంటే ఒక్కరూ నాతో చెప్పలేదు. నాకు తెలిస్తే వాణ్ణి వెళ్లనివ్వను!" అని పద్మముఖి అమిత దుఃఖంతో ఏడ్చింది. ఆమెతోబాటు ఆమె ఇంటవున్న పరిచారికలందరూ ఏడ్చారు.

"పెళ్లికూతురు పెళ్లికోసం ఏడుస్తున్నట్టున్నది. తన కొడుకు పోతాడని తెలియదు, పాపం!" అన్నాడొక దుర్మార్గుడు.

"మీరెవరూ నోరు పారేసుకోవద్దు. ధీరమతి హత్యగురించి పురుగుకైనా తెలియనివ్వకండి" అంటూ దుర్బుద్ధి తన అనుచరులలో సమర్థులను ఇరవైమందిని ఎన్నుకుని, వారితో సముద్రతీరానికి వెళ్లాడు.

వారు ఒక పడవలో కత్తులూ కఠార్లూ పెట్టుకుని, తెడ్లు అమర్చి తీరానికి దూరంగా లంగరు వేశారు. తరవాత వారు తీరాన

నావికులెవరు? ధీరమతి నౌకర్లా, లేక ఊళ్లో ఉండే యువకులా? అసలు ధీరమతి ఏ పనిమీద పైలాస్‌కు వెళ్లాడు? ఆ సంగతి నీకేమైనా చెప్పాడా?" అని ప్రశ్నలవర్షం కురిపించాడు.

"నా ఇష్టంమీదే పడవను తీసుకుపోయారండి. అంతవారు వచ్చి అడిగితే ఎలా లేదనను? ఆయన అడగ్గానే సంతోషంగా నా పడవను ఇచ్చాను. ఊళ్లో ఉండే జమాజట్టిల్లాంటి కుర్రాళ్లు నావికులుగా వెళ్లారండి. సహనుడు వాళ్లకు నాయకుడుగా వెళ్లాడు," అని ఆ వచ్చిన యువకుడు దుర్బుద్ధికి జవాబు చెప్పాడు.

దుర్బుద్ధి కళ్లవెంట నిప్పులు రాలాయి. అతను తన అనుచరులకేసి తిరిగి, "ఇది సహించరాని సంగతి! మనందరి కళ్లలోనూ

భోజనం చేసుకు తిని రాత్రికోసం ఎదురు చూడసాగారు.

ఆ రోజు పద్మముఖి భోజనం చెయ్య లేదు. ఆ రాత్రి ఆమెకు నిద్రకూడా సరిగా లేదు. తాను తన కొడుకునే చూస్తానో కొడుకు శవాన్నే చూస్తానో అని ఆమె వాపోవ సాగింది. ఆ సమయాన ఆమెకు చీకట్లో తన సోదరి ఆకారం కనిపించి, "ఎందుకు దుఃఖిస్తున్నావు, అక్కా? నీ కొడుకుకు ఏ ప్రమాదమూ రాదు," అని చెప్పి చూస్తుండగానే మాయమయింది.

ఆ రాత్రే దుర్మార్గులు తమ పడవను ఒక రాళ్లగుట్టల దీవికి తీసుకుపోయి అక్కడ లంగరువేసి, ధీరమతికోసం ఎదురు చూడ సాగారు.



ఈలోపుగా అక్కడ ధీరమతి ప్రతాపుడికి వీడ్కోలుచెప్పి, ఆయననుంచి అనేక బహుమానాలు పొంది బయలుదేరాడు. అతను సముద్రతీరాన్ని చేరుకుని, తన నావికులను కలుసుకుని, దేవతలకు బలులిచ్చి నౌకలో ఇంటికి ప్రయాణమయ్యాడు. అయితే అతను నౌకను నేరుగా నగరానికి నడపక మరొక రేవు వద్దకు పట్టించి అక్కడ తాను దిగి, తన అనుచరులతో, "మీరు నగరానికి వెళ్లండి. నేను మా పందులకాపరిని ఒక మారు కలుసుకుని , ఆ తరవాత నగరానికి వస్తాను," అని చెప్పాడు.

ధీరమతి పందులకాపరి గుడిసె వద్దకు చేరుకునే సమయానికి రూపధరుడూ, పందులకాపరీ గుడిసెలోనే ఉండి వంట చేసుకుంటున్నారు. గుడిసె బయట ఉన్న జాగిలాలు నాలుగూ ధీరమతిని చూసి గుర్తించి, తోకలాడిస్తూ, సంతోషంగా అతని పైకి దూకాయి.

"ఎవరో వచ్చారు. నీకు తెలిసినవాళ్లో, నీ స్నేహితులో అయి ఉండాలి. ఎందుకంటే కుక్కలు మొరగటానికి బదులు, వారితో మారాం చేస్తున్నాయి," అని రూపధరుడు పందులకాపరితో అన్నాడు.

రూపధరుడు మాట్లాడటం పూర్తిచేసే లోపుగానే ధీరమతి గుడిసెద్వారంలోకి వచ్చి నిలబడ్డాడు.

అతన్ని చూస్తూనే పందులకాపరి సంభ్రమంతో లేచి, తన యజమాని దగ్గరికి పరిగెత్తి, ఏ దూరదేశం నుంచో తిరిగివచ్చిన కొడుకును ఆప్యాయంగా కౌగిలించుకున్నట్టు కౌగిలించుకుని, "వచ్చావా, నాయనా, నిన్ను మళ్లీ ఈ కళ్లతో చూస్తాననుకోలేదు. లోపలికి



ధీరమతి లోపలికి రావటం చూసి రూప ధరుడు లేచి అతనికి చోటివ్వబోయాడు. కాని ధీరమతి, "లేవకు, తాతా. నేను కూర్చు నేటందుకు ఇంకో ఆసనం దొరక్క పోదులే!" అన్నాడు.

రూపధరుడు మళ్ళీ కూచున్నాడు. పందుల కాపరి ధీరమతికోసం ఒక చర్మం పరిచి కూచోబెట్టాడు. తరవాత ముగ్గురూ కూచుని భోజనం చేశారు.

భోజనం అయ్యాక ధీరమతి పందుల కాపరితో, "చిన్నాయనా, ఈ కొత్తమనిషి ఎవరు? ఈయనను ఎవరు ఇక్కడికి తెచ్చారు?" అని అడిగాడు.

"బాబూ, ఈయన క్రీట్ దేశస్తుడనని చెబుతున్నాడు. ప్రపంచమంతా తిరిగాడట. ఆయన లోకసంచారం చేయాలని దేవుడు రాసి పెట్టినట్టుంది. ఆయన ప్రమాదంనుంచి తప్పించుకుని నా గుడిసెలో తల దాచుకు న్నాడు. ఆయనను నీ చేతుల్లో పెడుతున్నాను, నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి," అన్నాడు పందులకాపరి.

"నాకు ఎటువంటి పరీక్ష పెట్టావు, చిన్నాయనా! ఈ అతిథిని నా ఇంటి కెలా తీసుకుపోగలను? నేను చిన్నవాణ్ణి, నా ఇంటి నిండా శత్రువులేనాయె! వాళ్ళంతా పెళ్ళిచేసుకోమని తొందరపెడుతూంటే ఏమీ నిర్ణయించలేని స్థితిలో ఉన్నది మా అమ్మ. అందుచేత నేను ఈయనకు చేయగల సహాయం ఏమంటే, వేసుకునేటందుకు బట్టలిస్తాను, పాదరక్షలిస్తాను, పదునైన కత్తి ఇస్తాను. ఆయన ఎక్కడికి పోదలిస్తే అక్కడికి వెళ్ళమను; లేదా, నీ గుడిసెలోనే ఉంచుకుని

రా, బాబూ. అసలు నువ్వు నా గుడిసెకు వచ్చేదే అరుదు. పైలాస్‌కు వెళ్లావుటకాదూ? ఎప్పుడు తిరిగి వచ్చావు?" అన్నాడు. అతని కళ్లవెంట ఆనందబాష్పాలు రాలాయి.

"అక్కడినుంచే వస్తున్నాను, చిన్నాయనా. మా ఇంటి విశేషాలేమిటి? మా అమ్మ క్షేమంగా ఉందా? లేక ఎవరైనా దుర్మార్గులు ఆవిడను పెళ్ళాడేశారా?" అని ధీరమతి అడిగాడు.

"అటువంటి దేమీలేదు, బాబూ. ఆవిడ ఎప్పటిలాగే ఉంది. అయితే, ఆవిడకు రాత్రిం బవేళ్ళు దుఃఖం తప్ప మరొకటి లేదు. ఆ దుర్మార్గుల బారి నుంచి ఆమెకు ఎప్పుడు విముక్తి లభిస్తుందో ఏమో!" అన్నాడు పందులకాపరి, ధీరమతి చేతిలో వున్న ఈటె తీసుకుంటూ.

ఆయన యోగక్షేమాలు చూడు. ఆయన పోషణభారం నీపైన లేకుండా, నే నాయనకు కావలసిన తిండీ బట్టా పంపుతాను. అంతేగాని, ఆ దుర్మార్గుల మధ్యకు ఆయన రావటం నాకిష్టం లేదు. వాళ్ళాయనను చాలా హింస పెడతారు. ఆ అవమానాన్ని నేను సహించ లేను," అన్నాడు ధీరమతి.

తరవాత అతను పందులకాపరితో, "చిన్నా యనా, నువ్వు వెంటనే మా ఇంటికి వెళ్ళి. మా అమ్మను ఒంటరిగా పిలిచి, నేను పైలాస్ నుంచి తిరిగివచ్చాననీ, నీ గుడిసెలో క్షేమంగా ఉన్నాననీ, నా కోసం విచారించవద్దనీ చెప్పు," అన్నాడు.

"బాబూ, మీరు ప్రయాణమై వెళ్ళినది మొదలు మీ తాతగారు అన్నం ముట్టలేదుట. ఆయనకు కూడా మీరు తిరిగి వచ్చిన వార్త చెప్పిరానా? పాపం, పెద్దవాడు!" అన్నాడు పందులకాపరి.

"నువ్వు మరెక్కడికీ వెళ్ళకు. వీలు చూసుకుని కబురు పంపమని మా అమ్మతో చెప్పి, నువ్వు వెంటనే ఇక్కడికి తిరిగిరా!" అన్నాడు ధీరమతి.

పందులకాపరి బయలుదేరి వెళ్ళాడు. గుడిసెలో తండ్రీకొడుకులిద్దరు మాత్రమే ఉండిపోయారు.

అకస్మాత్తుగా గుడిసెబయట రూపధరుడికి బుద్ధిమతీదేవి ప్రత్యక్షమై, బయటికి రమ్మని సంజ్ఞ చేసింది. రూపధరుడు ఒంటరిగా బయటికి వెళ్ళాడు. ఆ దేవి అతనితో, "నీ కొడుకుతో నువ్వెవరో చెప్పేసి, అతని సాయంతో నీ శత్రువులనందరినీ నాశనం చెయ్యటానికి ఉపక్రమించు. ఆ దుర్మార్గుల పాపం పండింది. మీ ఇద్దరికీ నేను అండగా ఉన్నాను. గనక, మీరు ఏమాత్రం భయపడనవసరం లేదు," అంటూ రూపధరుణ్ణి తన దండంతో మెల్లగా తాకింది.





వెంటనే రూపధరుడి మొహాన ముడత లన్నీ పోయి పడుచువాడయ్యాడు. అతని దుస్తులు కూడా మారిపోయాయి. ఇలా మారి లోపలికి వచ్చిన రూపధరుణ్ణి చూసి ధీరమతి నిర్ఘాంత పోయాడు. "అయ్యా, మీరెవరు? ఎవరో దేవత అయి ఉండాలి. మామూలు నరులు ఇలా తమ ఇష్టానుసారం తమ రూపాన్ని మార్చుకోలేరు. అదీగాక నరులకు అద్భుతమైన ఈ తేజస్సు ఉండదు!" అన్నాడు ఆశ్చర్యంగా.

రూపధరుడు తనను తాను బయటపెట్టు కున్నాడు.

"నేను నీ తండ్రిని, రూపధరుణ్ణి, నాయనా! మార్గమధ్యంలో చెప్పనలవి కాని అనేకకష్టాలు పడి చివరకు స్వదేశం చేరుకున్నాను," అంటూ అతను కొడుకుతో తన కథ యావత్తూ చెప్పి, "మన ఇంట ఎంతమంది దుర్మార్గులున్నారో చెప్పు! వారిని మనం కడతేర్చుదాము," అన్నాడు.

"అందరూ కలిసి నూట ఎనిమిదిమంది ఉన్నారు. వీరు గాక ఆరుగురు నౌకర్లున్నారు. వీరందరినీ మనిద్దరమూ ఎలా కడతేర్చ గలం, నాన్నా?" అని ధీరమతి అడిగాడు అనుమానంగా.

"పిచ్చివాడా, మనం ఇద్దరమేననుకుంటు న్నావు గాని, మన వెంట బుద్ధిమతీదేవి సహాయం ఉన్నది. అందుచేత తెల్లవారే సరికల్లా నువ్వు ఇంటికి వెళ్ళు. నేను బిచ్చగాడి రూపంలో మన పందులకాపరి వెంట అక్కడికి వస్తాను. ఆ దుర్మార్గులు నన్ను ఎన్నిరకాల అవమానాలు చేసినా నువ్వు సహించి ఊరుకో. కాని నాకేసి ఒక కన్ను ఉంచు. నేను సంజ్ఞ చేసినప్పుడు నువ్వు గోడలమీద ఉండే కత్తులూ, కఠార్లూ తీసి మేడమీద గదిలో ఒక మూల దాచెయ్యి. ఆయుధాలేమైనాయని వాళ్ళెవరైనా అడిగితే, తుప్పుపట్టటంచేత తీసి దాచానని మర్యాదగా చెప్పు. కాని మన ఇద్దరికీ కావలసిన ఆయుధాలు – రెండు ఈటెలూ, రెండు కత్తులూ, మరి రెండు తోలు డాళ్ళూ – అందుబాటులో ఉంచు. నువ్వు జాస్తిగా తాగి ఎవరితోనూ జగడం పెట్టుకోకు సుమా, మన పని కాస్తా పాడవు తుంది. మరొక ముఖ్య విషయం – నేను తిరిగి వచ్చానన్న సంగతి ఒక్క పురుగుకు కూడా తెలియరాదు – మీ అమ్మకు కూడా చెప్పకు. ఈ విషయం రహస్యంగా ఉండడం చాలా ముఖ్యం. ప్రస్తుతానికి ఈ సంగతి మన ఇద్దరికి మాత్రమే తెలిసి ఉండాలి," అని రూపధరుడు తన కొడుకుతో చెప్పాడు.

ఈలోపుగా, ధీరమతి పైలాస్‌నుంచి తిరిగి వచ్చిన పడవ నగరం చేరింది. ఆ పడవ నడిపిన వారిలో ఒకడు రూపధరుడి ఇంటికి వచ్చాడు. ఆ మనిషీ, పందులకాపరీ ఒక్కసారే ఇంటి ముందు తారసిల్లారు. పద్మముఖికి ధీరమతి రాకగురించి చెప్ప టానికి నావికుడు వచ్చిన సంగతి తెలుసుకుని ఆమె ఇంట చేరిన దుర్మార్గులు కలవరం చెందారు. ధీరమతిని దారిలో చంపెయ్య టానికి వెళ్లిన వారు కూడా కొంతసేపటికి తిరిగివచ్చారు.

వారందరూ కలిసి ఒక రహస్య సమావేశం చేశారు. అప్పుడు వారితో దుర్బుద్ధి ఇలా అన్నాడు:

"ఈసారికి వీడు ప్రాణాలతో బయట పడ్డాడు. కాని వీణ్ణి త్వరలో చంపకపోతే మనకు ప్రమాదం ఉంది. అసలే ప్రజలు మనపట్ల విముఖులుగా ఉన్నారు. వీడు వచ్చి అందరితోనూ మన హత్యాప్రయత్నం గురించి చెప్పేస్తాడు. అప్పుడు ప్రజలు మనల నందరినీ దేశంనుంచి తరిమేస్తారు. అందు చేత మనం ఈ ధీరమతిని నగరం ప్రవేశించే సమయంలో హతమార్చి వాడి ఆస్తిని పంచుకోవాలి. మనలో ఎవడు పద్మముఖిని పెళ్ళాడితే వాడికి రూపధరుడి ఇల్లు దక్కు తుంది. అలాకాక మనం ధీరమతిని బతకనివ్వదలచిన పక్షంలో మనం రూప ధరుడి ఇంట వుండే అవకాశంలేదు. ఎవరి ఇంట వారుండి పద్మ ముఖిని పెళ్ళాడే ప్రయత్నం చేయటం బాగుంటుంది. ఎలా నిర్ణయిస్తారో చెప్పండి!"

ధీరమతిని హత్యచేసే ప్రయత్నానికి కొందరు అభ్యంతరం చెప్పారు. "ధీరమతికి చచ్చే యోగం ఉన్నదీ లేనిదీ తెలుసుకోకుండా మనం ఏమీ చేయగూడదు. చచ్చే యోగం ఉన్నట్టు దేవతలు చెబితే ఆ హత్యను నేనే స్వయంగా చేస్తాను. అంతదాకా మనం తొందర పడవద్దు!" అన్నాడొకడు.

ఈ సలహాను అందరూ ఆమోదించి ఇంటికి తిరిగి వెళ్ళారు.

ఆ సాయంకాలం పందులకాపరి తిరిగి తన గుడిసెకు వచ్చేలోగా బద్ధిమతీదేవి మళ్ళీ రూపధరుడి ఆకారాన్ని గుర్తించ రాకుండా ముసలివాడిగా మార్చేసింది. ఆ రాత్రి భోజనా లయ్యాక ధీరమతి తన తండ్రితో బాటు పందులకాపరి గుడిసెలోనే హాయిగా నిద్ర పోయాడు. —(ఇంకావుంది)



# వార్తలలో బాలలు

## మునినాలుక మీద ప్రపంచం!

ఆఫ్రికా ఖండంలో ఎన్ని దేశాలు ఉన్నాయి? టర్క్‌మెనిస్తాన్ రాజధాని ఏది? ఉజ్బెకిస్తాన్ కరెన్సీ పేరేమిటి? ఇటీవల బొంబాయి ప్రెస్‌క్లబ్‌లో మోనికామేనన్‌ను అడిగిన ప్రశ్నలలో ఇవికొన్ని. దాదాపు గంటసేపు జరిగిన ప్రశ్నోత్తర కార్యక్రమంలో, ఆమె అడిగిన ప్రతి ప్రశ్నకూ క్షణాలలో సరైన సమాధానం చెప్పింది. ఒక్క తప్పు కూడా రాలేదు. ప్రపంచంలోని దాదాపు 185 దేశాల రాజధానులూ, ఆయా దేశాలలో వాడుకలో ఉన్న కరెన్సీలూ ఆమెకు కంఠతా వచ్చు. ఇంతకూ మోనికా మేనన్ వయసు ఎంత అనుకున్నారు? ఐదేళ్ళే! ఒకటవ తరగతి చదువుతున్నది. ప్రశ్నోత్తరాల అనంతరం ఆ అమ్మాయిని గురించి వివరించిన ఆమె తల్లి వనజా మేనన్, గత డిసెంబర్‌లో అమ్మాయికి బహుమతిగా ఒక గ్లోబు కొనిపెట్టినట్టూ, దానిని మోనికా ఎప్పుడూ పరిశీలించి చూస్తూండేదనీ, అలా వివిధ దేశాలూ, వాటి 'రాజధానులూ గురించి త్వరగా నేర్చుకున్నదనీ చెప్పారు. గ్లోబుతో పాటు ఆ అమ్మాయి తమ ఇంట్లో ఉన్న ఎన్‌సైక్లోపీడియాను కూడా తిరగేస్తూం డేదని మోనికా తండ్రి తెలియ జేశారు. పిల్లలలో నిక్షిప్తంగా ఉండే ప్రతిభను పసిగట్టి, ప్రోత్స హించినట్టయితే ప్రతిభావంతులుగా రాణించ గలరనడానికి మోనికా మేనన్ ఒక చక్కని ఉదాహరణ.

## మేధాసంపత్తి

'మెన్సా'- అత్యధిక మేధాశక్తి గలవారు సభ్యులుగా గల అంతర్జాతీయ సంస్థ. ఈ సంస్థలో ఇంగ్లాండుకు చెందినవారే దాదాపు 40,000 మంది సభ్యులుగా ఉన్నారు. వారందరిలోకీ అతి పిన్న వయస్కురాలు పశ్చిమ ఇంగ్లాండుకు చెందిన మూడేళ్ళ రియాన్నాన్ పేయిన్. ఆ సంస్థలో చేర్చుకోవడానికి ముందు పెట్టిన ఇంటిలిజెన్స్ టెస్ట్‌లో ఆమె ఉన్నతస్థానం పొందింది. తనకు రెట్టింపు వయసుగల పిల్లలు చదివే పుస్తకాలను రియన్నాన్ సునాయాసంగా చదువగలుగుతున్నది. ఆ పాపాయి ఇప్పుడే నర్సరీ క్లాసులో చేరింది.

## చీనా భాషలో చిన్నారి ప్రతిభ!

దక్షిణ చైనాకు చెందిన 'డాంగ్ డాంగ్ అనే మూడేళ్ళ చిన్నారి, చీనా భాషలో 3,000 అక్షరాలను చదువగలుగుతున్నది. వాటిలో దాదాపు 6,000 ఆధార అక్షరాలు ఉన్నాయి. వంపులు, కొక్కెలు, ఒత్తులతో వాటితో రకరకాల పదాలు తయారవుతాయి. ఇరవై నెలల పాపగా ఉన్నప్పుడే డాంగ్ డాంగ్ 200 పద్యాలనూ, నర్సరీ రైమ్సునూ కంఠతా పట్టింది. అప్పుడే 10,000 పదాలకు పైగా రాయగలిగేది. ఇంతటి ప్రతిభాశాలి అయిన ఆ చిన్నారి పేరు 'షాంఘాయ్ గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్'లో స్థానం సంపాయించుకోవడంలో ఆశ్చర్యం లేదుకదా!

## ప్రకృతి మిత్రుడు

ఢిల్లీలో ఎనిమిదవ తరగతి చదువుకుంటూన్న హర్షభాత్రా అనే విద్యార్థి పర్యావరణ పరిరక్షణకు 'పంచవటి' అనే ఒక పథకాన్ని రూపొందించాడు. పర్యావరణ పరిరక్షణ పట్ల పిల్లలలో ఆసక్తిని పెంపొందించాలన్న ఉద్దేశంతో- ఐక్యరాజ్య సమితి ఇటీవల ఒక బాలల సదస్సు నిర్వహించింది. 80 దేశాల నుంచి వచ్చిన బాలబాలికలు సదస్సులో పాల్గొన్నారు. మన దేశం తరఫున కలుసుకున్న ఏకైక ప్రతినిధి పన్నెండేళ్ళ హర్ష భాత్రా. అతడు ఆ సదస్సులో మాట్లాడుతూ తన 'పంచవటి' పథకాన్ని వెలిబుచ్చాడు. అన్ని దేశాలలోనూ 'ఎకో-క్లబ్స్' ఏర్పరచాలనీ, తరచూ సమావేశాలూ, సదస్సులూ నిర్వహించాలనీ హర్ష సూచించాడు. మామూలుగా ఆటపాటల పట్ల, టీవీ కార్యక్రమాల పట్ల, కంప్యూటర్ల పట్ల ఆసక్తి కలిగే ఈ వయసులో ప్రకృతి పట్ల ఆసక్తి కనబరుస్తూ, దాని పరిరక్షణకు పథకాలు ఆలోచిస్తున్న హర్షభాత్రా మనస్తత్వం విలక్షణమైనది; ప్రశంసనీయమైనది.




# అదృశ్యశక్తులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకొని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వేదో అమానుష, అదృశ్యశక్తులను సాధించాలనే ప్రయత్నంలో, అర్ధరాత్రివేళ భయం గొలిపే ఈ శ్మశానంలో శ్రమల పాలవుతున్నావేమో అన్న అనుమానం కలుగుతున్నది. కొందరు వ్యక్తులు, కొన్ని కొన్ని సంఘటనలూ, దృష్టాంతాలూ చూసి, తమకు ఏ శ్రమా లేకుండా అయాచితంగా అదృశ్యశక్తుల సాయం లభించిందన్న నమ్మకానికి లోనవుతారు. నువ్వూ, ఏదో ఒకనాడు అలాంటి భ్రమకు గురికాకుండా ఉండేందుకు గాను, హిమకరుడనే ఒక రాజకుమారుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

## బేతాళ కథలు



పూర్వం గోదావరీనది ప్రాంతాన సోమపురం అనే చిన్నరాజ్యం ఉండేది. దానికి యువరాజు హిమకరుడు. అతడూ, సైన్యాధిపతి కుమారుడైన భద్రవర్మా, మంత్రికుమార్తె మధుమతీ బాల్యస్నేహితులు. హిమకరుడు, భద్రవర్మ పదేళ్ళ పాటు గురుకులంలో విద్యనభ్యసించారు. వారు తిరిగి తమ రాజ్యానికి బయలుదేరే సమయంలో, గురుకుల ప్రధానాచార్యుడు భద్రవర్మకు తెలియకుండా, హిమకరుడికి పరకాయ ప్రవేశవిద్య బోధించాడు. ఆచార్యుల ఆశీస్సులు పొంది ఇరువురూ రాజధానికి చేరారు.

రాజప్రాసాదపు ప్రధానద్వారం ముందున్న మైదాన ప్రదేశంలో, రోజూ సాయంకాలాల్లో యువకుల మధ్య రకరకాల పోటీపందాలు జరుగుతూండేవి. ఒకసారి పరుగుపందాలలో హిమకరుడు ఓడిపోయాడు. గెలిచినవాడు ఒక దండనాయకుడి కొడుకు. వాడు యువరాజుపై గెలిచానన్న అహం కొద్దీ హిమకరుణ్ణి గేలిచేస్తూ మాట్లాడాడు. అందుకు హిమకరుడు ఏమీ అనలేదు కానీ, వాణ్ణి ఆ రాత్రి ఏదో విషకీటకం కరవడంతో, నెల రోజులు మంచాన పడ్డాడు.

ఇంకొకసారి, ఉద్యానవనంలో వున్న హిమకరుడు, మధుమతుల దగ్గరకు వచ్చిన ఆస్థాన వైద్యుడి కొడుకు, అకారణంగా హిమకరుడిపై పోట్లాటకు దిగి, అతడిపై రాయి విసిరాడు. హిమకరుడికి పెద్ద దెబ్బ తగలలేదు గాని, ఆ సాయంత్రం ఓషధి మొక్కలకు నీరు పోస్తున్న వైద్యుడి కొడుకుని పాముకరిచి, తండ్రి వైద్యసాయంతో బతికి బయటపడ్డాడు. ఈ విషయం హిమకరుడికి తెలిసింది.

మధుమతి అసాధారణ సౌందర్యవతి, ఆమెపట్ల హిమకరుడికీ, భద్రవర్మకూ ప్రేమ భావం ఉండేది. వారిద్దరూ ఎవరికి వారుగా, మధుమతి తమను ప్రేమిస్తున్నదన్న నమ్మకంలో ఉండేవారు.

ఒకనాటి ఉదయం ముగ్గురూ, రాజుగారి పండ్లతోటలోకి వాహ్యాళికి వెళ్ళారు. అక్కడ విచిత్రంగా, కాలం కాని కాలంలో – ఒక మామిడిచెట్టు చిటారుకొమ్మనుంచి మామిడి పండొకటి వేలాడుతున్నది. దాన్ని చూసి నోరూరి మధుమతి, వాళ్ళతో ఆ మామిడి పండును కోసి తెమ్మన్నది.

వెంటనే భద్రవర్మ గబగబా చెట్టు ఎక్కసాగాడు. హిమకరుడు కూడా ఆ పండును కోసి తనే ముందుగా మధుమతికి ఇవ్వాలని

చెట్టు ఎక్కబోయాడు. అంతలో అతడి దృష్టి కొద్ది దూరంలో చచ్చిపడివున్న చిలకమీద పడింది. ఆ మరుక్షణం అతడు తనునేర్చిన పరకాయ ప్రవేశ విద్యను ఉపయోగించి, చిలక శరీరంలో ప్రవేశించి, రివ్వున చెట్టుమీదికి ఎగిరి పండును తుంచి కిందికి వచ్చి, తిరిగి తన శరీరంలోకి చేరి, పండును మధుమతికిచ్చాడు. ఇదంతా రెప్ప పాటుకాలంలో జరిగిపోయింది.

ఇది చూసిన భద్రవర్మ కోపం పట్టలేక, "రాకుమారా! ఇది చాలా అన్యాయం. చెట్టు ఎక్కటంలో నేర్పరితనం చూపలేక, మంత్ర తంత్రాలను ఆశ్రయించడానికి సిగ్గు లేదా? కుయుక్తులు వీరుడి లక్షణం కాదు; భీరువు లక్షణం!" అంటూ అరిచి, చెట్టు దిగుతూ పట్టుతప్పి నేలమీద పడ్డాడు.

ఆ పాటుకు భద్రవర్మ కాలి ఎముక విరిగి, మూడు నెలల పాటు నడవలేని స్థితిలో ఉండిపోయాడు.

ఈ సంఘటన తర్వాత, హిమకరుడి మనస్సులో ఇంతకాలంగా ఇదీ అని తేల్చి చెప్ప లేని ఊహలకు, ఒక స్థిరరూపం ఏర్ప డింది. తనకు ఏదో ఒక అదృశ్యశక్తి సాయపడు తున్నదనీ, అది తనను కించపరచిన వారిని తగు విధంగా శిక్షిస్తున్నదనీ అనుకున్నాడు. ఇందుకు, అతడికి ఎన్నో దృష్టాంతాలు కనిపించ సాగాయి. వాటిని కాకతాళీయంగా కొట్టిపారెయ్యడానికి, అతడికి మనస్కరించ లేదు. తనతో కయ్యం పెట్టుకున్న వారు ఎవరైనా సరే, వెనువెంటనే తప్పక కష్టాలపాలవుతారన్న దృఢ నమ్మకం హిమకరుడికి కలిగింది.



తన కుమారుడు, మంత్రికుమార్తె మధు మతితో తరచుగా తిరుగుతున్నాడనీ, ఆమె పట్ల అతడికి ప్రేమభావం ఏర్పడి ఉంటుం దనీ ఊహించిన రాజు, ఒకనాడు అతడితో, "నీకు యౌవ రాజ్య పట్టాభిషేకం చేద్దా మనుకుంటున్నాను. నీ వివాహం కూడా అదే సమయంలో జరిగితే బాగుంటుందేమో అని భావిస్తున్నాను. ఈ విషయంగా మన మహామంత్రిని పిలిచి మాట్లాడనా?" అన్నాడు.

హిమకరుడు ఇందుకు సమాధానంగా చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. తన తండ్రి, తన మనోభావాన్ని గ్రహించడమే కాకుండా, ఏ రాజకుమార్తెనో వివాహ మాడమని బలవంత పెట్టనందుకు లోలోపల చాలా సంతోషించాడు.



ఈ శుభవార్త చెబుదామనుకుని హిమకరుడు, ఆనాటి సాయంత్రం నదీ విహారానికి రమ్మనమని మధుమతికి కబురు పంపాడు. అయితే, అనుకోకుండా భద్రవర్మ కూడా మధుమతితో నదీతీరానికి రావడంతో, ముగ్గురూ పడవ మీద దాపులనే వున్న, ఒక చిన్న లంకకు వెళ్ళారు. తిరుగు ప్రయాణంలో హిమకరుడు వారికి, తన తండ్రి నిర్ణయాన్ని గురించి చెప్పాడు. భద్రవర్మ తన మిత్రుడు కనక అది విని ఎంతో సంతోషిస్తాడనుకున్నాడు. అయితే, హిమకరుడికి మధుమతిని, భద్రవర్మ కూడా ప్రేమించాడన్న విషయం తెలియదు. తెలిసివుంటే, ఆ సమయంలోతన వివాహ విషయాన్ని ప్రస్తావించి ఉండేవాడు కాడు.

భద్రవర్మ ముక్కోపి, నిర్భయుడు. అతడు ఆగ్రహావేశంతో – హిమకరుడు రాజకుమారుడు కనుక, అతడు తన అంతస్తును, అధికారాన్ని దుర్వినియోగపరుస్తున్నాడని అభాండం వేశాడు. తాను, మధుమతిని ప్రేమిస్తున్న సంగతి ఎరిగి కూడా, ఆమెను వివాహం చేసుకోవాలనుకోవడం పెద్ద ద్రోహ మనీ, హిమకరుడు మిత్రద్రోహి అనీ నిందించాడు. చివరగా, హిమకరుడితో, "నీ తండ్రి రాజు, మధుమతి తండ్రి ఆయన మంత్రి కనుక, నీ పంతం నెగ్గించుకోగలవు! నువ్వింత నీచుడవని నేనూహించలేదు. నీలో క్షాత్రధర్మం ఏమైనా మిగిలి ఉంటే, నాతో ఇప్పుడే ద్వంద్వ యుద్ధం చెయ్యి. మధుమతిని గెలుచుకో!" అంటూ కయ్యానికి కాలుదువ్వాడు.

మధుమతి ఇదంతా చూస్తూ, తనకేమీ పట్టనట్టు నిర్లిప్తంగా ఉండిపోయింది.

హిమకరుడు కోపాన్ని అణచుకుంటూ, భద్రవర్మను శాంతింపజేయాలని ప్రయత్నించాడు కానీ, భద్రవర్మ కోపంతో ఊగిపోతూ ఒరనుంచి కత్తిదూశాడు. హిమకరుడికి తనను కాపాడుతున్న అదృశ్యశక్తీ, పాత దృష్టాంతాలూ జ్ఞాపకం వచ్చి, అతడి కుడిచేతి మణికట్టును గట్టిగా ఒడిసి పట్టుకుని వారించబోయాడు. అయితే, భద్రవర్మ ఆవేశంతో అతడి మీద కలియబడే ప్రయత్నం చేయడంతో, పడవ పక్కకు ఒరిగిపోయింది.

ముందుగా నదిలో పడ్డ మధుమతి వెనక్కు తిరిగి చూడకుండా, నదీతీరంకేసి ఈదుకుంటూ పోసాగింది. హిమకరుడితో

పాటు భద్రవర్మ కూడా నీటిలో పడ్డాడు. భద్రవర్మ ఒడ్డు చేరలేదనీ, నదిలోకి మునిగి పోతాడనీ – అతడు తనపై కత్తి దూయడం వల్లే ప్రమాదం జరిగిందనీ, హిమకరుడు అనుకున్నాడు. ఇంతలో బోర్లాపడిన పడవ ముందుభాగం తలకు బలంగా కొట్టు కోవడంతో అతడికి స్పృహ తప్పింది. నదిలోకి మునిగిపోసాగాడు.

హిమకరుడికి తిరిగి స్పృహ వచ్చాక చూస్తే- అతడి పొట్ట నొక్కుతూ, తాగిన నీళ్ళను కక్కించడానికి ప్రయత్నిస్తున్న భద్రవర్మ కనిపించాడు. పక్కనే మధుమతి ఉన్నది. హిమకరుడు లేచి కూర్చోగానే, భద్రవర్మ ఈసడిస్తున్నట్లు అతడికేసి చూసి, మాటా పలుకూ లేకుండా అక్కడి నుంచి వెళ్ళి పోయాడు.

అప్పుడు మధుమతి, హిమకరుడితో, "గజఈతగాడివైన నువ్వు తలకు చిన్న దెబ్బ తగిలి ఎందుకు మునిగిపోయావో తెలుసా? భద్రవర్మ ఇంతకుముందేనాకు తన రహస్యం ఒకటి చెప్పాడు. అతణ్ణి అంటిపెట్టుకుని ఎల్లవేళలా, ఒక అదృశ్య శక్తి ఉంటుందట! అది అవసరమైనప్పుడు తన శత్రువులను ఇలాంటి ప్రమాదాలకు గురిచేస్తూ ,ఒక్కొక్కసారి వాళ్ళను `హత మారుస్తుందట కూడా!" అనిచెప్పి, హిమ కరుడు ఏదో చెప్ప బోయేంతలో విని పించుకోకుండా విసురుగా అక్కణ్ణించి వెళ్ళి పోయింది.

తర్వాత, హిమకరుడు అంతఃపురం చేరుతూనే, తండ్రి దగ్గరకు పోయి, తన కిప్పట్లో వివాహం చేసుకోవాలని లేదనీ, కొన్నాళ్ళపాటు దేశాటన చేయాలని ఉన్నదనీ చెప్పి, తండ్రి నుంచి అనుమతిపొంది అప్పటికప్పుడే దేశాటనకు బయలుదేరి వెళ్ళాడు.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా,హిమకరుడి వింత ప్రవర్తనకు అర్థం ఏమిటి? తండ్రికి, మధుమతితో వివాహానికి అంగీకారం తెలిపి, తరవాత దేశాటనకంటూ ఎందుకు బయలుదేరిపోయాడు? భద్రవర్మకు భయపడా? భద్రవర్మ చేసుకోవాలనుకున్న మధుమతిని, తను వివాహమాడితే, అతడి వెంటవున్న అదృశ్యశక్తి తనను ఎప్పుడో ఒకప్పుడు బలిగొంటుందనే భయం చేతా? లేక తాను స్పృహ తప్పి నదిలోకి మునిగిపోతూంటే భద్రవర్మ రక్షించాడన్న కృతజ్ఞతతో, ప్రాణదాత అయిన తన మిత్రుడి కోసం మధుమతి పట్ల గల తన ప్రేమను త్యాగం చేశాడా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "హిమకరుడు, మధుమతిని వివాహం చేసుకోకపోవడానికి ఇవేవీ కారణాలు కావు. అతడు మొదట్లో అదృశ్యశక్తిని గాఢంగా నమ్మాడు. తనను ఎల్లవేళలా వెన్నంటి వున్న ఆ అదృశ్య శక్తి వలన, తనతో పోట్లాడిన భద్రవర్మ తప్పక నదిలోకి మునిగిపోతాడనుకున్నాడు. అయితే ఎప్పుడు భద్రవర్మకు బదులు తనే నీట మునిగి పోవడం జరిగిందో, ఆ క్షణంలోనే అతడికి అంతవరకు ఉన్న అదృశ్యశక్తి మీద నమ్మకం మటుమాయమయింది. తన అదృశ్యశక్తిలో నమ్మకం లేనివాడు, ఇంకొకడికా శక్తి వున్నదంటే ఎలా నమ్ముతాడు? కనుక భద్రవర్మను చూసి గాని, అతడి అదృశ్య శక్తులను తలచుకుని గాని హిమకరుడు భయపడలేదు. మధుమతి తనను ప్రేమించిందని, హిమకరుడు అనుకున్నాడు. కాని, పడవ పక్కకు ఒరగ గానే మధుమతి తనకేసి అయినా చూడకుండా, తన ప్రాణం రక్షించుకునేందుకు ఒడ్డుకు ఈదుకు పోతూండడం చూశాక, ఆమెకు తన మీద ఏమాత్రం ప్రేమంటూ లేదని గ్రహించాడు. అలాంటప్పుడు, నీట మునుగుతున్న తనను భద్రవర్మ రక్షించాడన్న కృతజ్ఞతాభావంతో, హిమకరుడు మధుమతిపై గల తన ప్రేమను త్యాగం చేశాడనుకోవడం ఎందునా పొసగని మాట," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)
[ఆధారం: రామవరపు గణేశ్వరరావు రచన]





# తెలివైన మొండితనం

దొండపాడు గ్రామంలో ఉండే సీతయ్యకు, తానెలాంటివాడితో నైనా వాదించి నెగ్గగలనని నమ్మకం. అయితే, అదే గ్రామంలో ఉండే రాజయ్య మొండివాడనీ, అతడితో ఎవరూ నెగ్గలేరనీ అంతా అంటూంటారు.

ఒకరోజు సీతయ్య, రాజయ్య పొలంలో కలుసుకున్నారు. ఎలాగో అలా రాజయ్యను వాదనలోకి దింపాలన్న ఉద్దేశ్యంతో, "ప్రతి రోజూ నీ మేకలు నా పొలంలో పడి మేస్తున్నాయి. అందుకు నష్ట పరిహారం చెల్లించు. రోజూ పాలైనా పొయ్యి. ఈ రెండూ కాదంటే, గ్రామాధికారికి ఫిర్యాదు చేస్తాను," అన్నాడు సీతయ్య.

"పశువులు పచ్చిగడ్డి మేస్తాయి. ఆకులు తింటాయి. నీ పొలంలో ఆ రెండూ లేవు. నీ ఫిర్యాదు చెల్లదు," అన్నాడు రాజయ్య.

"అదిగో చూడు. అక్కడ పొలంలో పశువులు మేస్తున్నాయి," అన్నాడు సీతయ్య వెంటనే.

రాజయ్య అటుకేసి చూస్తే, కొన్ని ఆవులు సీతయ్య పొలంలో మేస్తున్నాయి.

"పశువులంటే నా ఉద్దేశ్యం మేకలు. మనం మేకల గురించి కదా మాట్లాడుకుంటున్నాం, అక్కడ మేస్తున్నవి ఆవులు!" అన్నాడు రాజయ్య.

సీతయ్యకు పట్టుదల వచ్చింది. "నాతోరా, నీకు మేకల్నీ చూపిస్తాను," అన్నాడు.

ఇద్దరూ కొంతదూరం నడిచారు. ఆవులకు వెనగ్గా కొంతదూరంలో వాళ్ళకొకమేక కనిపించింది. "చూశావా, ఇక్కడ మేక ఉంది. ఇది మేయడానికే వచ్చింది," అన్నాడు సీతయ్య.

"ఏమో, పైరు మేయడానికే వచ్చిందన్ని ఎలా చెప్పగలం? నా కళ్ళతో నేను చూస్తే తప్ప నేనేదీ నమ్మను," అన్నాడు రాజయ్య.

"సరే, అలాగే చూద్దువు గాని!" అంటూ సీతయ్య, మేకను దాపులనున్న వంగ,

జొన్నలగడ్డ రామలక్ష్మి

దోసపాదులకేసి తరిమాడు. మేక వెంటనే తల వంచి ఆకులను కొరకసాగింది.

"ఇప్పుడేమంటావు?" అన్నాడు సీతయ్య గర్వంగా.

"నేను నా మేకల గురించి చెప్పాను. ఈ మేక నాది కాదు," అన్నాడు రాజయ్య.

సీతయ్యకు ఉక్రోషం వచ్చి, "మేకలన్నీ ఒక్కటే- నీకు తెలియదేమో," అన్నాడు.

"ముందే చెప్పానుగా! నా కళ్ళతో చూస్తే తప్ప నేనేదీ నమ్మను," అన్నాడు రాజయ్య.

అంతలో రాజయ్య పాలేరు మేకల్ని తోలుకుంటూ అటుగా వెళుతున్నాడు. సీతయ్య వెంటనే, "పోనీ, ఆ వెళుతున్న మేకలు నీవే కదా! కాదంటావా?" అన్నాడు.

రాజయ్య గర్వంగా, "అవి నావే!" అన్నాడు.

సీతయ్య పాలేరును పిలిచి, "ఒరేయ్, ఈ మేకలు ఆ కనబడే వంగ, దోస, గోరుచిక్కుడు పైర్లను మేస్తాయిరా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు పాలేరు ఆశ్చర్యపోతూ, "ఎందుకు మెయ్యవు, బాబూ! మీకు తెలియదా- మేకలు ఒక్కరాటపు ఆకును తప్ప, మిగతా ఆకులన్నిటినీ ఆవురావురంటూ మేస్తాయి," అన్నాడు.

"అయితే ఒక్కసారి మేపు. నీ యజమాని చూస్తాడు," అన్నాడు సీతయ్య.

తనకు నష్టం జరిగినా, వాదనలో రాజయ్యను ఓడించి గ్రామంలో మెప్పు పొందాలన్న పట్టుదల కలిగింది సీతయ్యకు.

పాలేరు మేకల్ని కూరపాదులకేసి తోలాడు. అవి ఉత్సాహంగా తోకలాడిస్తూ మేయ సాగాయి. అప్పుడు సీతయ్య తాను గెలిచానన్న ధీమాతో గట్టిగా చప్పట్లు చరిచి, "చూడు, చూడు రాజయ్యా! కళ్ళారా చూడు. ఇంత కంటే రుజువేం కావాలి నీకు? నీ మేకలే నా పైరు మేస్తున్నాయి. ఇప్పుడేమంటావు?" అని అడిగాడు.

"నేనటుకేసి చూడను," అన్నాడు సీతయ్య.

"అయితే నా ఆరోపణ నిజమని ఒప్పుకుంటావా?" అన్నాడు సీతయ్య.

"ఎలా ఒప్పుకుంటాను? ముందే చెప్పాను గదా – స్వయానా నా కళ్ళతో చూడందే ఏదీ ఒప్పుకోను," అన్నాడు రాజయ్య.

ఆ జవాబుతో – రాజయ్యది మొండితనం కాదనీ, అసలు సిసలు తెలివి అనీ అప్పటి కర్థమై, సీతయ్య తన ఓటమిని గ్రహించాడు.



# సముద్ర తీర ప్రయాణాలు -9

రచన: మీరా నాయర్ ♦ చిత్రకారుడు: గౌతమ్‌సేన్




తాడిచెట్లతో నిండిన దక్షిణ కన్నడ సముద్రతీరంలో ఉద్యావరనది అని కూడా పిలువబడే మాల్పే నదీ ముఖంలో మాల్పే రేవు ఉన్నది. మన దేశంలో చేపలను ఎండబెట్టి నిల్వచేసే అతి పెద్ద రేవు ఇది.

మాల్పే చాలా సుందరమైన తీరం. దీనికి పశ్చిమంగా మూడు రాతి దీవులు ఉన్నాయి. వీటిలో ఒక దానిని కొబ్బరి దీవి అని అంటారు. ఈ దీవిలోనే స్తంభాకృతిగా ఏర్పడిన లావా బండలు ఉన్నాయి. వీటిని జాతీయ భూతత్వ చిహ్నంగా చెబుతారు. దాదాపు 60 మిలియన్ సంవత్సరాలకు పూర్వం పెల్లుబికిన లావా కారణంగా ఈ బండలు ఏర్పడ్డాయి.

మాల్పేకు నాలుగు కి.మీ. దక్షిణంగా సుప్రసిద్ధ యాత్రా స్థలమైన ఉడుపి క్షేత్రం ఉన్నది. దాదాపు ఏడు వందల సంవత్సరాలకు పూర్వం ద్వైత సిద్ధాంత కర్త అయిన మధ్వాచార్యులు ఇక్కడ ఎనిమిది మఠాలను స్థాపించాడు. ఇక్కడ ఒక గుడిలో కృష్ణవిగ్రహం వెనక్కు తిరిగిన భంగిమలో ఉన్నది. క్రీ.శ. 1550వ సం॥లో ఆ ప్రాంతంలో జన్మించిన కన్నడ కవి కనకదాసు గొప్ప కృష్ణ భక్తుడు. అయినా, ఆయన పుట్టింది కురుబ కులంలో కాబట్టి, పెద్దలు ఆయనను కులం పేరు చెప్పి ఆలయంలోనికి రానివ్వలేదు సరికదా– ఆలయ ద్వారం ముందు కూడా నిలబడనివ్వలేదు! కనకదాసు తన స్థితికి దేవుణ్ణి తలుచుకుని విలపిస్తూ, ఆలయం వెనకకు వెళ్ళి నిలబడ్డాడు. వెంటనే ఆలయం లోని కృష్ణ విగ్రహం వెనక్కు తిరగడంతో, కిటికీ గుండా



శ్రీ మధ్వాచార్యుల విగ్రహం



కొబ్బరిదీవిలోని స్తంభాకృతి దాల్చిన లావా



ఉడుపిలోని శ్రీకృష్ణ మందిరం

కనకదాసుకు దర్శనం లభించిందట. అప్పటినుంచి ఆ కిటికీని 'కనకన కిండి' అని పిలవడం ప్రారంభించారు.

రోజూ అనేక మంది భక్తులు ఆలయ దర్శనానికి వస్తూ ఉంటారు. రెండేళ్ళకు ఒకసారి భారీ ఎత్తున జరిగే 'పర్యాయోత్సవ' సమయంలో చుట్టుపక్కల నుంచి లక్షలాది మంది భక్తులు వస్తారు.

ఉడుపి కేవలం యాత్రాస్థలంగా మాత్రమే కాదు; ఈనాడు ముఖ్యమైన విద్యాకేంద్రం గానూ, బ్యాంకింగ్ సెంటర్ గానూ అభివృద్ధి చెందుతున్నది.

ఉడుపికి నాలుగు కి.మీ. నైరుతి దిశలో, మధ్వాచార్యుల జన్మస్థానమైన ఉద్యావరం ఉన్నది. ఆయన జన్మించిన చోట ఆయన విగ్రహం ప్రతిష్ఠించబడి ఉన్నది.

ఉడుపికి దక్షిణంగా – కార్కాల, ముడ్బిద్రి అనే రెండు సుప్రసిద్ధ జైన క్షేత్రాలు ఉన్నాయి. 12.8 మీ॥ ఎత్తయిన

ముడ్బిద్రిలోని వేయిస్తంభాల బాసాడి



గోమఠ విగ్రహానికి ప్రసిద్ధి గాంచిన జైనక్షేత్రం కార్కాల. ఈ విగ్రహం క్రీ.శ. 1432 వ సం॥లో ప్రతిష్ఠించబడింది. బ్రహ్మాండమైన విగ్రహాలు మలచడంలో సిద్ధహస్తుడని ప్రసిద్ధిగాంచిన శిల్పకారుడు రెంజాల్ గోపాల్ షెనాయ్ జన్మస్థలం కార్కాల. ఆయన మలిచిన బ్రహ్మాండమైన విగ్రహాలు కర్నాటకలోనూ, మన దేశంలోని ఇతర ప్రాంతాలలోనే కాకుండా, జపానులో కూడా ప్రతిష్ఠించ బడ్డాయి.

ముడ్బిద్రిని 'జైనకాశి'గా చెబుతారు. ఇక్కడ బ్సాడీలనే పద్దెనిమిది జైన ఆలయాలు ఉన్నాయి. వీటిలో కెల్లా చాలా పెద్దది త్రిభువన తిలక చూడామణి బాసాడి. దీనిని వెయ్యిస్తంభాల బాసాడి అని కూడా అంటారు. ఇక్కడ ఏకశిలా స్తంభాలూ, అమూల్యమైన ఆభరణాలతో నిండిన తీర్థంకరుల విగ్రహాలూ చాలా ఉన్నాయి.

16వ శతాబ్దానికి చెందిన రత్నాకరవర్ణి అనే కన్నడకవి ముడ్బిద్రిలో ఉన్నప్పుడే 'భారతేష వైభవ' అనే తన సుప్రసిద్ధ గ్రంథాన్ని రచించాడని చెబుతారు.

ముడ్బిద్రికి దక్షిణంగా మంగళూరు ఉన్నది. 10వ శతాబ్దానికి చెందిన



కార్కాలలోని గోమఠ విగ్రహం



నేత్రావతి, గుర్పూర్ నదుల సంగమం వద్ద మంగళూరు ఉన్నది

రాణి మంగళాదేవి పేరు మీదుగా దీనికి పేరు వచ్చింది. క్రీ.శ. 2వ శతాబ్దం నుంచే ఇదొక ఓడరేవుగా ప్రసిద్ధిగాంచింది. టిప్పు సుల్తాను కాలం నుంచి మంగళూరు మనదేశంలో ఒక ముఖ్యమైన పట్టుపరిశ్రమ కేంద్రంగా అభివృద్ధి చెందింది.

కర్నాటకలో మంగళూరు ఈనాడు ఉన్నత విద్యా కేంద్రంగానూ, వ్యాపార, పారిశ్రామిక కేంద్రంగానూ మాత్రమే కాకుండా ప్రధాన రేవుపట్టణంగా కూడా అభివృద్ధి చెందుతున్నది.

ఇప్పుడు నిర్మాణంలో ఉన్న 760 కి.మీ. దూరంగల సముద్రతీర కొంకణ రైల్వే మంగళూరును ముంబాయికి కలుపుతుంది. ఈ పథకం పూర్తయినట్టయితే ముంబాయి నుంచి మంగళూరుకు రావాలంటే ఇప్పుడు పట్టే 41 గంటల ప్రయాణ సమయం 18 గంటలకు తగ్గుతుంది.

దక్షిణ కన్నడ తీర దక్షిణాగ్రంలో, మంగళూరుకు 8 కి.మీ. దక్షిణంగా తెల్లటి సముద్రతీరాలకు ప్రసిద్ధిగాంచిన ఉళ్ళల్ ఉన్నది. 17వ శతాబ్దం ఉత్తరార్థంలో ఈ ప్రాంతాన్ని రాణి అబ్బక్కాదేవి పరిపాలించింది. ఆమె పాలనకు రాగానే – అంతకు పూర్వం తన పూర్వీకులు – అధికారంలో ఉన్న పోర్చుగీసులకు చెల్లిస్తూ వచ్చిన పన్నును చెల్లించడం ఆపివేసింది.

రాణి అబ్బక్కాదేవి పోర్చుగీసులు విధించిన వ్యాపార నిషేధాన్ని ఉల్లంఘిస్తూ ఆరబ్ దేశాలకు తమ వ్యాపార ఓడలను పంపింది. పోర్చుగీసులు ఉళ్ళల్ మీదికి దండెత్తి వచ్చారు. అం[illegible]నప్పటికీ అబ్బక్కాదేవి సేనలు, రాణి ఆజ్ఞానుసారం పోర్చుగీసులను తరుమగొట్టాయి.

పోర్చుగీసుల మీద
ఘనవిజయం సాధించిన
ఉళ్ళల్ రాణి అబ్బక్కాదేవి.





# అన్నదాన మహిమ

కొమర్రాజులంక అనే గ్రామంలో, అన్నమయ్య అనే దాత ఉండేవాడు. గోదావరినదీ ప్రాంతంలో కొమర్రాజులంక వ్యవసాయానికి చాలా ప్రసిద్ధి కెక్కింది. ఎక్కడెక్కడినుంచో వ్యవసాయకూలీలు వచ్చి, కొమర్రాజులంక గోదావరి ఒడ్డున పడవలెక్కి, లంకలో కూలి పనులు చేసేవారు. అందుకు ముఖ్య కారణాల్లో ఒకటి అన్నమయ్య అన్నదానమే. పొట్ట చేతపట్టుకుని వచ్చిన నిరుపేద కూలీలకు, అన్నమయ్య ఉచితంగా భోజనం పెట్టేవాడు.

ఆయన కూలీలతో, " మొహమాట పడకుండా భోజనం చెయ్యండి. ఎవరు కష్టపడ్డా జానెడు పొట్ట కోసమే. మీకు భోజనం పెట్టడం వల్ల, నాకు నష్టమేమీ లేదు!" అనేవాడు.

ఏ బాటసారైనా, తీర్థయాత్రికుడైనా అర్ధరాత్రి తలుపు తట్టినా సరే, ఆప్యాయంగా ఆదరించి అన్నం పెట్టి, ఆయన అన్నమయ్య అన్న పేరును సార్థకం చేసుకున్నాడు.

ఒక రోజున నీలకంఠయ్య అనే ధనికుడు ఒంటెద్దు బండిలో ప్రయాణం చేస్తూ, చీకటి పడే వేళకు కొమర్రాజులంక చేరుకున్నాడు. ఆయన వెళ్ళవలసిన ఊరుకు ఇంకా నాలుగైదు క్రోసుల దూరం ప్రయాణం చేయాలి కనక, ఆ రాత్రికి అక్కడే ఆగిపోదలచాడు.

ఆయన, బండివాణ్ణి పూటకూళ్ళ బస ఎక్కడో తెలుసునా అని అడిగాడు. అందుకు వాడు, "అయ్యా! అన్నమయ్య లాంటి అన్నదాత వున్న గ్రామంలో పూటకూళ్ళ బసకు చోటే లేదు. వెళ్ళదలిస్తే, మనం అన్నమయ్య గారింటికే వెళ్ళాలి," అన్నాడు.

చేసేది లేక నీలకంఠయ్య, అన్నమయ్య ఇంటి ముందు బండి దిగి, ఇంటి తలుపులు మూసి వుండడంతో, అక్కడ అరుగు మీద వున్న వాలుకుర్చీలో హుందాగా కూర్చున్నాడు.

కొంతసేపటికి అన్నమయ్య తలుపులు తెరిచి బయటికి రాగానే, "నాకూ, నా బండి

జె. ఉదయనాగశిరీష



వాడికీ రెండు భోజనాలు చేయించు. ఖర్చుకు వెనుకాడకు. మంచి కూరలు, రెండు రకాల పచ్చళ్ళు వుండాలి. నా పేరు నీలకంఠయ్య. విష్ణుపురంజమీందారుకు మరీ అంత దూరపు బంధువునేం కాదు. భోజనం నా హోదాకు తగినట్లుగా వుండాలి," అన్నాడు.

అన్నమయ్యకు ఆ ధనికుడి మాటలు చిరాకు తెప్పించినా, నవ్వుతూ, "నా దృష్టిలో ఇంటికి వచ్చిన అతిథి విష్ణుమూర్తితో సమానం. ధనికుడైనా, పేదవాడైనా ఒకే పంక్తిలో కూర్చుని పరబ్రహ్మ స్వరూపమైన అన్నాన్ని ఆరగిస్తూంటే చూసి తరించాలని నా కోరిక. తాత తండ్రులు సంపాదించిన ఆస్తి నాకు కోకొల్లలుగా వుంది. అందరికీ పెట్టే భోజనమే మీకూ పెట్టగలను. ఆకలి మీకూ, బండివాడికీ సమానమే అయినప్పుడు ఆకలికి లేని అంతస్తు- మనిషిగా మీరు కల్పించుకున్నందుకు, నాకు ఆశ్చర్య మేస్తున్నది. నా గృహం అన్నం అమ్ముకోదు. అంతస్తు మరిచేలా చేసి, సహపంక్తిలో నిరతాన్నదానం చేస్తుంది. కాళ్ళు కడుక్కుని వచ్చి భోజనం చెయ్యండి," అన్నాడు.

అన్నమయ్య ధర్మబుద్ధీ, దానగుణం చూసి నీలకంఠయ్య తన అహంకార ప్రవర్త నకు నొచ్చుకుని, "ఈ ఊరిలో ఆకలిగొన్న వారికి ఉచితంగా పట్టెడన్నం పెట్టి ఆదరిస్తున్న మీముందు, నేను అల్పుణ్ణి. నన్ను క్షమిం చండి!" అని తృప్తిగా భోజనం చేసి, పక్కనే ఉన్న బండివాడితో, "ఈ కొద్దిసేపూ నేను ఆస్తిపరుణ్ణన్న సంగతి మర్చిపో," అంటూ వాడు భోజనం పూర్తి చేసేదాకా విస్తరి ముందు నుంచి లేవలేదు.

ఆ మర్నాడు తెల్లవారుతూనే నీల కంఠయ్య అన్నమయ్యకు కృతజ్ఞతలు చెప్పు కుని, తిరిగి ప్రయాణం సాగించాడు.

బండి ఊరు దాటి ఎత్తయిన నది కట్ట మీదగా పోతూండగా, బండివాడిలో దుర్బుద్ధి పుట్టింది. వాడు బండిని ఆపి, నీలకంఠయ్యను బండి దిగమన్నాడు. కారణం ఏమిటా అనుకుంటూ నీలకంఠయ్య బండి దిగగానే వాడు, ఆయనకేసి క్రూరంగా చూస్తూ, "నేను ఎవరికీ పనివాడుగా ఉండదలచలేదు. సులువుగా ధనికుణ్ణయ్యే మార్గం తెలిసింది. మర్యాదగా నీ దగ్గరున్న డబ్బంతా అక్కడ పెట్టు!" అన్నాడు.

నీలకంఠయ్య భయపడి, "దోచిన డబ్బు నిలవదు. దానితో ధనికుడు కావాలను కోవడం భ్రమ. ఇంటికి వెళ్ళాక, నువ్వు నీతీ

నిజాయితీలతో ధనం సంపాదించేందుకు అవసరమైన పెట్టుబడి నేను ఇస్తాను," అన్నాడు.

కానీ, దురాశాపిశాచానికి లొంగిపోయిన బండివాడు అందుకు ఒప్పుకోక, నీలకంఠయ్య దగ్గరున్న డబ్బు లాక్కుని, ఆయనను వేగంగా ప్రవహిస్తున్న నదిలోకి తోసి, అక్కడి నుంచి పారిపోయాడు.

తర్వాత వాడు కొన్ని రోజులు ప్రయాణం చేసి, రామనగరమనే జమీందారుండే పట్టణం చేరాడు. అక్కడ వాడు, నీలకంఠయ్య వద్ద దోచిన సొమ్ముతో చిన్న వ్యాపారం ప్రారంభించి, అచిరకాలంలోనే పెద్ద ధనవంతుడై నగర ప్రముఖుల్లో ఒకడయ్యాడు.

అయితే, క్రమంగా బండివాడిలో పాపభీతి ప్రారంభమైంది. అందుచేత వాడు ప్రతిరోజూ ఇద్దరు పేదలకు ఉచితంగా అన్నం పెట్టే నియమం అలవాటు చేసుకుని, "ఈ పుణ్యం నన్ను రక్షించుగాక!" అనుకునేవాడు.

ఇలా వుండగా– చచ్చిన నీలకంఠయ్య పిశాచమయ్యాడు. అది బండివాడి మీద పగ బట్టింది. పిశాచం రామనగరం చేరి, అక్కడ పెద్ద లోగిలిలో మహా వైభవంతో వెలిగిపోతున్న బండివాడిని చూసి మండిపడింది. ఆ సమయంలో వాడు విలువైన దుస్తులు ధరించి జమీందారు కొలువు చేరి, ఒక ఉన్నతాసనం మీద కూర్చున్నాడు. ఆ వేళ కొలువులో కాకతాళీయంగా పిశాచాల గురించిన చర్చ జరుగుతున్నది. పిశాచాలున్నవి- లేవు; అంటూ అందరూ వాదోపవాదాలు చేస్తున్నారు.ఇదే మంచి సమయమనుకుని, పిశాచ రూపంలో వున్న



నీలకంఠయ్య, బండి వాడి నావహించాడు. అంతే! బండివాడిలో విపరీతమైన మార్పు వచ్చింది. వాడు లేచి నిలబడి, "ఇదుగో, పిశాచాన్ని వచ్చాను. చేతనైతే నా బారినుంచి వీణ్ణి రక్షించండి!" అని అరుస్తూ చిందులు వేయసాగాడు.

మొదట్లో అది వినోదంగా అనిపించినా, కొద్దిసేపట్లోనే అందరూ భయపడసాగారు. వాణ్ణి పట్టుకున్నది పిశాచమని తెలియగానే, జమీందారుతో సహా అందరూ కంగారు పడ్డారు. ఆస్థాన భూతవైద్యుడికి కబురు వెళ్ళింది. ఆయన వచ్చి మంత్రోచ్చాటన చేసి, నీలకంఠయ్య పిశాచంతో మాట్లాడి, బండివాడు చేసిన ఘోరం తెలుసుకుని,

"ఓ పిశాచమా! జరిగిందేదో జరిగింది. ఈ బండివాణ్ణి కఠినంగా శిక్షిస్తాం. వీణ్ణి

వదిలి పెట్టిపో," అన్నాడు. అందుకు పిశాచం అట్టహాసంగా నవ్వి, "ఈ దుష్టుడి శరీరం నాకక్కర లేదు. నేను పిశాచరూపం నుంచి విముక్తి పొందాలంటే- కొమఠ్రాజు లంక నుంచి నిరతాన్నదాత అన్నమయ్య వచ్చి, 'ఈ దురాశాపరుడికి ఒక్కడికీ చేసిన అన్నదాన ఫలాన్ని, నాకు ధారపోయమనండి!" అంటూ ఊగిపోసాగింది.

కొమఠ్రాజులంక నుంచి అన్నమయ్యను తీసుకువచ్చారు. ఆయనను చూడగానే బండివాడిలోని పిశాచం వినయంగా నమస్క రించి, "అయ్యా! అపాత్రుడికి అన్నం పెట్టినా, అది గొప్పదానమే అని ఇప్పుడు తమరు నిరూపించాలి! ఈ బండివాడికి దానం చేసిన అన్నదాన ఫలం ధారపోసి, నన్ను పిశాచరూపాన్నుంచి విముక్తుణ్ణి చేయండి," అన్నాడు.

దీనికి అన్నమయ్య, "నాకు అన్నదాన మహిమ గురించి తెలియదు. ధనికుడైనా, దొంగ అయినా, బిచ్చగాడైనా - కాలే కడుపును గుర్తించటమొక్కటే నాకు తెలుసు! నేను ఫలితమాశించి అన్నం పెట్టలేదు. కానీ, నిజంగా అన్నదాన మహిమ వుంటే, నీకు పిశాచరూపం తొలగిపోతుంది," అన్నాడు.

పిశాచం వినయంగా, "మహానుభావా! ఆకలి చెడ్డది. వివేకం కోల్పోయేలా చేస్తుంది. నీ అన్నదాన పుణ్యాన్ని నాలాంటి పిశాచికి ధారపోసి రక్షించావు. నీ అన్నదాన మహిమ లోకానికి తెలియడానికీ, అడ్డ దారిలో ధన వంతుడైన, ఈ మనిషి పిశాచాన్ని పట్టివ్వ డానికీ, ఈ బండివాణ్ణి పట్టుకున్నాను. నేనిదే వెళ్ళిపోతున్నాను," అన్నది.

పిశాచం వదిలిపోగానే బండివాడు సొమ్మసిల్లి పడిపోయాడు. కొంచెం సేపటికి వాడు తేరుకుని, జరిగినదంతా విని పశ్చాత్తాపంతో కుంగిపోయాడు. తర్వాత వాడు తన సొమ్మంతా జమీందారు పరం చేసి, అన్నమయ్యతో కొమఠ్రాజులంకకు వెళ్ళి, అన్నదానంలో ఆయనకు సాయపడ సాగాడు.

వాడు వచ్చిన వాళ్ళందరికీ అన్నదాన మహిమ గురించి చెప్పి, "కలిగినంతలో ఆకలితో వున్నవాడికి అన్నం పెట్టండి. కష్టపడి సంపాదించండి," అని హితవు చెబుతూండేవాడు.



చందమామ



# బంగారు గడియలు

## పది కపాలాలు

కోసల రాజ్యంలో వర్షాలు లేక కరువు ఏర్పడడంతో ఆదిత్య మహారాజు కపాలిముని సహాయం అర్థించి వెళ్ళాడు.
















# బంగారు గడియారాలు ప్రశ్నావళి



**1** బుద్ధ భగవానుడు కోసల రాజ్యం అడవి గుండా వెళుతున్నప్పుడు అంగుళీమాలుడనే అతి భయంకరమైన దారిదోపిడీ దొంగ అడ్డుపడ్డాడు. బుద్ధుణ్ణి కూడా చంపి, అలవాటు ప్రకారం ఆయన బొటనవేలును కూడా తన మెడదండలో గుచ్చుకోవాలని అంగుళీమాలుడు అనుకున్నాడు. కాని బుద్ధుడు, వాడి తప్పును వాడే గ్రహించే విధంగా చేసి, వాణ్ణి మంచిమార్గానికి మళ్ళించాడు. వాడొక సన్యాసిగా మారిపోయాడు.

అంగుళీమాలుడనే పేరు పొందక ముందు ఆ దోపిడీదొంగ పేరేమిటి?



**2** మొట్టమొదట ఆస్ట్రేలియాకు వెళ్ళి స్థిరపడిన యూరోపియన్లు తమ వెంట ఒక జంతువును తీసుకువెళ్ళారు. అది ఇప్పుడు ఆ దేశంలో పైరు పచ్చలను నాశనం చేసే జంతువుగా తయారయింది. ముఖ్యంగా ఇవి రైతులు తమ గొర్రెలకు, ఆవులకు గ్రాసంగా పెంచే గడ్డిని నాశనం చేస్తున్నవి. వాటి నుంచి గడ్డిని రక్షించుకోవడానికి రైతులు పొడ వాటి కంచెను ఏర్పాటు చేసుకున్నారు. ఆ జంతువుల పేరు ఏమిటి?

**3** లండన్‌లోని విక్టోరియా అండ్ ఆల్బర్ట్ మ్యూజియంలో నిజమైన పులి పరిమాణంలో ఒక కొయ్యపులి బొమ్మ ఉన్నది. అది ఒక బ్రిటిష్ సైనికుడి మీద పడి చంపుతున్నట్టు ఉన్నది. దానికి పక్కన ఉన్న హ్యాండిల్‌ను తిప్పినట్టయితే పులి గాండ్రిస్తుంది. సైనికుడు బాధతో దీనంగా మూలుగుతూ ఒక చేయి పైకెత్తుతాడు. ఈ పులిబొమ్మ ఎవరికి చెందినది?



ఒక డ్రాయర్‌లో ఆరు తెల్లవి, ఆరు నల్లవి మొత్తం 12 సాక్స్ ఉన్నాయి. కరెంటు పోవడంతో గది చీకటైపోయింది. నల్లవైనా, తెల్లవైనా ఒక జత సాక్స్ కావాలంటే, వాటిలోనుంచి ఎన్ని సాక్స్ తీసుకోవాలి?







సోముడి పడవ తీరం చేరగానే, అతనికి దగ్గరగా ఒక ఏనుగు కనిపించింది. ఆ ఏనుగు అతడు ఎరుగున్న మనిషిదే. ఆ ఏనుగు బరువెంత? అని సోముడు ఆ మనిషిని అడిగాడు. ఆ ఏనుగు బరువు నాకు తెలియదు. నువ్వు చెప్పావంటే దాని మీద సవారి చేయడానికి అనుమతిస్తాను- అన్నాడా మనిషి. సోముడి దగ్గర 50 కి.గ్రా తూకం వేయగల 'వేయింగ్ మెషీన్' మాత్రమే ఉన్నది. మరి అతడు ఏనుగును ఎలా తూకం వేశాడు?




ఒక కమ్మరి ఎనిమిది ఫిరంగు గుండ్లు తయారు చేశాడు. అన్నీ చూడడానికి ఒకే విధంగా ఉన్నాయి. వాటిలో ఏడు సమానమైన బరువును కలిగి వున్నాయి. ఒక్కటి మాత్రం మిగతా వాటికన్నా కొద్దిగా తేలికగా ఉన్నది. మీకొక త్రాసును ఇచ్చి రెండు తూకాలలో ఆ తేలిక అయినగుండు ఏదో కనుగొనమంటే ఎలా కనుగొంటారు?




ప్రాచీన ఈజిప్టులో మృతదేహాలను పాతిపెట్టేప్పుడు, వాటి చేతిలో వెండి, కంచు నాణేలను ఉంచేవారు. ఎందుకో తెలుసా?

# స్నాపీ గ్రీటింగ్ పంపండి




12 సెం.మీ. కొలతతో ఒక మందమైన అట్టను తీసుకుని సగంలో 3 మి.మీ. వెడల్పులో బొమ్మలో చూపినవిధంగా కత్తిరించుకోండి.




6 సెం.మీ 8 సెం.మీ కొలతతో మరొక అట్టను కత్తిరించుకోండి. దానిని మధ్యలో అతికించండి.




పై అట్టను ఖాళీకి ఇవతలగా మడిచి దానిచుట్టూ రబ్బర్‌బ్యాండ్ వేయండి.




రబ్బర్ బ్యాండ్‌ను వదిలిపెట్టి, ఖాళీని అలాగే ఉంచి, దీని మీద రెండు కాగితం ముక్కలను అతికించండి. ఆ కాగితం మీద గ్రీటింగ్ రాయండి.




'స్నాపర్' కన్నా కొద్దిగా పెద్ద సైజులో గ్రీటింగ్ కార్డును తయారు చేసి, లోపల స్నాపర్‌ను అతికించండి.




ఇప్పుడు స్నాపర్ ఫ్లాప్స్‌ను అవతలి చివర మడిచి, కార్డును మూసి కవర్‌లో పెట్టండి. దీనిని మీ మిత్రులకు పంపండి. వారెంతో సంతోషిస్తారు.




# వ్యాన్ బొమ్మ గీయండి ... మూడు సులభమైన అంచెలలో






దుశ్శాసనుడు ప్రేరేపించగా దుర్యోధనుడు తండ్రి దగ్గరికిపోయి, "జూదంలో గెలిచినదంతా పోగొట్టావు. పాండవులు మనని యుద్ధంలో నిర్మూలించి తీరతారు. వాళ్ళకు అమితమైన బలసంపద ఉన్నది. వాళ్ళను మళ్ళీ జూదం ఆడటానికి పిలిపించు. ఈసారి వాళ్ళను జూదంలో ఓడించి పన్నెండేళ్ళు అరణ్యానికి పంపి, అరణ్యావాసం పూర్తి చేసే లోపల ప్రపంచంలోని రాజులందరినీ మన పక్షం చేసుకుని, యుద్ధం వస్తే పాండవులను తేలికగా నిర్మూలిస్తాం," అన్నాడు.

ధృతరాష్ట్రుడు దీనికి ఒప్పుకున్నాడు. భీష్మ ద్రోణ విదురులు మొదలైనవారు అనేకులు వద్దన్నారు. గాంధారి గట్టిగా అడ్డుపడింది. కౌరవకులం నాశనమవుతుందని చెప్పింది. కులం నాశనమైనా సరే, జూదాన్ని ఆపడం తన వశం కాదని ధృతరాష్ట్రుడు భార్యతో అన్నాడు. ఇలా అంటూనే ఆయన పాండవులను జూదానికి ఆహ్వానించడానికి ప్రాతికామిని పంపాడు.

మళ్ళీ జూదం ఆడటం అపాయకరమని తెలిసి కూడా ధర్మరాజు, తన తమ్ములనూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని, జూదం ఆడడానికి హస్తినాపురం వచ్చాడు.

జూదం ఆడేముందు శకుని ధర్మరాజుతో, "ఈసారి జూదంలో పందెం ఏమిటంటే, ఓడిపోయినవారు నారబట్టలు కట్టి పన్నెండేళ్ళు అరణ్యవాసం చేయాలి. ఆ తరవాత ఒక ఏడు అజ్ఞాతవాసం చెయ్యాలి. అజ్ఞాతవాసమప్పుడు బయటపడితే తిరిగి పన్నెండేళ్ళు అరణ్యవాసం చేసి, మళ్ళీ ఒక ఏడు అజ్ఞాతవాసం చేయాలి. పదమూడేళ్ళ అనంతరం ఎవరి రాజ్యాలు వాళ్ళు ఏలుకోవచ్చు," అన్నాడు.

శకుని తెలిపిన ఈ నియమాలు విని సభలోని వారు భయభ్రాంతులయ్యారు.



"ధృతరాష్ట్రుడు బుద్ధిలేక కొడుకు ఆడించినట్టు ఆడుతుంటే సభలోని ఇంతమంది పెద్దలు నివారించరేం?" అని కొందరు కోపంతో గట్టిగా అరిచారు.

ధర్మరాజు ఆ మాటలు విని, "రాజ ధర్మాన్ని పాలిస్తానని కంకణం కట్టుకున్న నా బోటివాడు, కుట్రదార్లు జూదానికి ఆహ్వానించినా వచ్చి జూదమాడి తీరాలి," అని శకునితో అన్నాడు.

శకుని పాచికలు వేశాడు. ధర్మరాజు పందెం ఓడాడు.

పందెం ప్రకారం ధర్మరాజూ, అతని తమ్ములూ, ద్రౌపదీ నారబట్టలు ధరించి, జడలు దాల్చి, జింకతోళ్ళు తీసుకుని వనవాసానికి పోవడానికి సిద్ధమయ్యారు. వాళ్ళను చూసి దుశ్శాసనుడు, "ఇంత కాలానికి పాండవులకు కష్టాలు ఆరంభం కావటం చూసి, నా జన్మ తరించింది. ఇక దుర్యోధనుడి ఏలుబడికి అడ్డు ఉండదు. ఐశ్వర్య గర్వంతో ఈ పాండవులు మమ్మల్ని చాలా లోకువ చేసి చూశారు. ఇప్పుడు వారికి తగిన పరాభవం జరిగింది. ఇక వారు అరణ్య మృగాల లాగా జీవిస్తారు. ఇక మాతో సమాన సంపద గలవారు ఎవరూ ఉండరు," అని, ద్రౌపదితో, "పాంచాలీ, దరిద్రులైన ఈ పాండవులతో అడవులలో ఎందుకు కష్టాలు పడతావు? మా కౌరవులలో నీ ఇష్టం వచ్చిన వాణ్ణి వరించి, హాయిగా రాజభవనంలో దాసదాసీ జనాలతో సమస్త భోగాలూ అనుభవించు," అన్నాడు గర్వాతిశయంతో.

భీముడీ మాటలు విని సింహం లాగా గర్జిస్తూ, "ఓరీ, పాపీ, శకుని ఆడిన మాయజూదం మూలాన నీ కింత కావరం వచ్చిందా? లేకపోతే ఇలా వదరగలిగి ఉందువా? నిన్ను యుద్ధంలో కీలూ కీలూ విరిచి చంపేటప్పుడు నిన్నే మంటానో అందరూ వింటారులే. నిన్నే కాదు, నిన్నాశ్రయించి ఉన్న దుర్మార్గులందరినీ యమలోకానికి పంపేస్తాను. ఇదే నా ప్రతిజ్ఞ!" అన్నాడు.

తరవాత భీముడు దుర్యోధనుడికేసి తిరిగి, "ఓరీ, మూర్ఖుడా! అప్పుడే ఏమయింది? నిన్ను యుద్ధంలో చంపిననాడు, దీని కంతకూ సమాధానం చెబుతాను," అన్నాడు పట్టరాని ఆగ్రహంతో.

తరవాత పాండవులు జూదం ఆడినచోటి నుంచి వెళ్ళిపోయేటప్పుడు భీముడు వెనక్కు

తిరిగి సభను చూసి, "గుర్తుంచుకోండి. యుద్ధంలో ఈ పాపాత్ముడైన దుర్యోధనుణ్ణి నేను భయంకరంగా చంపుతాను. వీడి స్నేహితుడైన కర్ణుణ్ణి అర్జునుడూ, ఈ శకునిని మా సహదేవుడూ చంపేస్తారు. ఈ దుష్ట చతుష్టయానికి మా చేతిలో చావు రాసిపెట్టి ఉన్నది. దాన్ని ఎవరూ తప్పించ లేరు," అన్నాడు.

భీముడికి అర్జునుడు అడ్డు వచ్చి, "వట్టి మాటల వల్ల లాభ మేమిటి? ఇంకా పధ్నాలుగేళ్ళకు చేయదలచిన దాన్ని ఇప్పుడే ఎందుకు చాటటం? అది కూడా, పద మూడేళ్ళూ పూర్తి అయినాక, ఈ దుర్మార్గుడు మన రాజ్యం మనకివ్వకపోతే మాట! అప్పుడు అన్నంత పనీ చేద్దాం, శాంతించు," అన్నాడు.




సహదేవుడు శకునితో, "ఓరీ, నీచుడా! పాచికలతో మోసం చేసినట్లు కాదు, యుద్ధభూమిలో నీ ప్రతాపం చూపించు. భీముడు అన్నట్టుగా నేను నీ ప్రాణాలు తీసి తీరుతాను. ఈ లోపల నీ పనులన్నీ ముగించుకుని, చావడానికి సిద్ధంగా ఉండు," అన్నాడు.

నకులుడు రౌద్రంగా, "ద్రౌపదిని ఈ సభలో పరాభవించిన వారినందరినీ పురుగులను చంపినట్టు చంపుతాం. ఇవి ప్రగల్భాలు కావు," అన్నాడు.

ఇలా పాండవులు తలా ఒక శపథమూ చేసి, ధృతరాష్ట్ర, భీష్మ, బాహ్లిక, కృప, ద్రోణ, అశ్వత్థామ, విదుర, సంజయాది పెద్దల వద్ద సెలవు పుచ్చుకుంటూ, "మళ్ళీ కలుసుకుందాం," అని చెప్పారు.

దుష్ట చతుష్టయానికి భయపడి మిగిలిన వాళ్ళు ఏమీ అనలేదు గాని, విదురుడు మాత్రం ధర్మరాజుతో, "మోసం చేత ఓడినవాడు ఓటమికి విచారించనవసరం లేదు. నీకు రత్నాలలాటి తమ్ములూ, బుద్ధిమంతురాలైన ద్రౌపదీ, జ్ఞాని అయిన ధౌమ్యుడూ ఉండగా ఏ లోటూ రాదు. ఐకమత్యం గల మీ అన్నదమ్ముల మధ్య ఎవరూ భేదాలు కలిగించలేరు. మిమ్మల్ని ఎవరూ ఓడించనూ లేరు. మీ తల్లి పెద్దది. మీతో బాటు అరణ్యవాసం చేయలేదు. అందుచేత, ఆమెను నా ఇంట పెట్టుకుని, నేను చూసుకుంటాను. అందుకు సరేనను. వెళ్ళిరా. నీకు శుభం కలుగుగాక. మళ్ళీ కలుసుకుందాం," అన్నాడు. ఇంకా అనేక హితవాక్యాలు చెప్పాడు.

ధర్మరాజు విదురుడితో, "నీవు నాకు తండ్రీ, గురువూలాటి వాడివి. మా హితం కోరే వాడివి. నువ్వు చెప్పినట్టే నడుచుకుంటాను," అన్నాడు.

ద్రౌపది అంతఃపురంలో ఉన్న కుంతికీ, గాంధారికీ, ఇతర పుణ్యస్త్రీలకూ నమస్కారం చేసి, తన ఈడువారిని కౌగలించుకుని, కంటతడి పెడుతూ, "వనవాసానికి పోతాను," అన్నది.

కుంతి ఆమెతో, "నీకు అన్నీ తెలుసును. భర్తల వెంబడి భార్య లుండడం సహజధర్మం. అందుచేత నువ్వు కంటతడి పెట్టకు. నువ్వు నిజంగా కోపంతో చూసి ఉంటే ఈ కౌరవులు భస్మమై ఉందురు. నేను నిన్ను ఒక్కటి కోరుకుంటున్నాను. మిగిలిన నలుగురూ ఒక ఎత్తూ, సహదేవుడు ఒక ఎత్తూనూ. వాడు చిన్నతనం నుంచీ సుకుమారుడు. కష్టాలు ఓర్చలేడు. వాణ్ణి కాస్త శ్రద్ధగా కనిపెట్టి ఉండు. వెళ్ళిరా, అమ్మా. ధర్మం జయించి మీకు శుభాలు కలుగుతాయి," అన్నది.

ఊడిపోయిన జుట్టుముడితో పెద్దపెట్టున ఏడుస్తూ, ద్రౌపది అంతఃపురం నుంచి బయలుదేరింది.

కుంతి ఆమె వెంటనే తన కొడుకుల వద్దకు వచ్చింది. వాళ్ళు మునివేషాలు వేసుకుని అరణ్యానికి బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నారు. కుంతి వారిని చూసి కళ్ళ వెంబడి అశ్రుధారలు కార్చుతూ, "కొడుకులారా, మీరు సర్వవేళలా ధర్మాన్ని ఎంతో శ్రద్ధగా ఆచరిస్తున్నప్పటికీ మీకు వనవాసం సంప్రాప్తమయింది. మనకు దేవుడు అనుకూలించలేదో, లేక నా కడుపున పుట్టినందుకు మీకిది శిక్షో! అరణ్యాలలో మీరు ఎలా ఉంటారో! మీ ఈ దుస్థితి చూడకుండా దేహం చాలించిన మీ



తండ్రీ, ఆయనతో పాటే పోయిన మాద్రీ అదృష్టవంతులు. నే నేదో మహాపాపంచేసు కుని, మీ కష్టాలు చూడడానికి బతికిఉన్నాను. ఇదివరకు మీతోబాటు కష్టాలన్నీ పంచు కున్నాను. ఇప్పుడు నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళక, మీతోబాటు తీసుకుపొండి. ఇటు వంటి విపత్కర పరిస్థితిలో అనాథ రక్షకు డైన ఆ కృష్ణుడు కూడా మనకు ఏమీ చేయ లేకపోయాడు," అన్నది.

తరవాత ఆమె సహదేవుడితో, "నువ్వు వనవాసం వెళ్ళకు, నాయనా. నువ్వు నా దగ్గర ఉంటే నా కొడుకు లందరూ దగ్గర ఉన్నట్టే ఉంటుంది," అని ఆపుకోకుండా ఏడవసాగింది.

విదురుడు ఆమెను ఎలాగో ఊరడించి, తన ఇంటికి తీసుకుపోయాడు.

పాండవులు తల్లికి మొక్కి, వనవాసానికి బయలుదేరారు. ద్రౌపది తల విరబోసుకుని వారి వెంట నడిచింది. ధర్మరాజు ముఖానికి గుడ్డ కప్పుకున్నాడు. భీముడు తన భుజాలు విశాలంగా పెట్టుకుని నడిచాడు. అర్జునుడు ఇసక చల్లుకుంటూ వెళ్ళాడు. నకులుడు తన శరీరం నిండా బూడిద పూసుకున్నాడు. సహదేవుడు తన ఒంటినిండా మట్టి చల్లుకున్నాడు.

ధౌమ్యుడు వారికి ముందు నడుస్తూ దీక్షతో రౌద్ర, యామ్యసామగానం చేశాడు.

ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి, "పాండవులు వనవాసానికి ఎలా వెళ్ళారు?" అని అడిగితే, పాండవులు ఎవరెవరు ఎలా వెళ్ళారో విదురుడు చెప్పాడు.

"ఎందుకలా వెళ్ళారు?" అన్నాడు ధృత రాష్ట్రుడు.

"నీ కొడుకులు చేసిన అన్యాయానికి మండిపోతున్న ధర్మరాజు తన చూపుతో ప్రజలు భస్మమై పోతారేమో నని ముఖానికి





గుడ్డ అడ్డం పెట్టుకున్నాడు. భీముడు లోకానికి తన భుజబలం ప్రదర్శించాడు. ఇసుక చల్లినట్టుగా బాణాలు వేసి శత్రుసంహారం చేస్తానని అర్జునుడు తెలియజేశాడు. తన అందం చూసిన ప్రజలు, తాను పడబోయే కష్టాలను గురించి మరింత విచారిస్తారని నకులుడు బూడిద పూసుకున్నాడు. తన దుఃఖం ప్రజలకు కనబడకుండా సహదేవుడు మట్టి కొట్టుకున్నాడు. ద్రౌపది తడిచీర కట్టుకుని జుట్టు విరబోసుకుని, మరి పధ్నాలుగేళ్ళకు నీ కోడళ్ళు విధవలై ఇలాగే ఏడుస్తారని సూచించింది. ధౌమ్యుడు దర్భలు చేతవట్టుకుని, రాబోయే యుద్ధంలో చచ్చేవారికి ఉత్తర క్రియలు చేయిస్తానని చెప్పడానికి రౌద్రసామం చదివాడు.. రాజా, నీ దుర్బుద్ధి మూలంగా కౌరవులకు మునుముందు వినాశం రాబోతున్నది," అన్నాడు విదురుడు.

పాండవులు వెళ్ళిపోయాక దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకుని దుష్టచతుష్టయం ద్రోణుడి వద్దకు వెళ్ళి, "మహానుభావా, పాండవుల నుంచి మేము గెలుచుకున్న రాజ్యాన్ని మీరు ఏలండి. అందుకు కావలసిన అర్హతలన్నీ మీకున్నాయి. అందుకు మీ కన్నా అర్హుడు లేడు," అన్నారు.

ఆ మాట విని ద్రోణుడు, "పాండవులను గెలవడం ఎవరి తరమూ కాదు. అయినా, నా పట్ల ఎంతో అభిమానంగా ఉండే దుర్యోధనాదులను నేను విడవలేను. పాండవులు నియమాన్ని నిర్వర్తించి, యుద్ధానికి సిద్ధపడి తప్పక వస్తారు. నా చేతిలో ఓడిపోయిన ద్రుపదుడు మహాయజ్ఞం చేసి, నన్ను చంపగల కొడుకునూ, అర్జునుడికి భార్య కాదగిన కూతురినీ సంపాదించాడు. ధృష్టద్యుమ్నుడు ద్రౌపది వివాహం ద్వారా పాండవుల మనిషి అయ్యాడు. దీనికి తోడు కృష్ణుడు కూడా పాండవుల పక్షాన ఉన్నాడు. అర్జునుడితో సమానుడైన అతిరథుడు గాని, మహారథుడు గాని లోకంలో ఎవడూ లేడు. నా చావు ధృష్టద్యుమ్నుడి చేతిలో ఉన్నదని అందరూ ఎరిగినదే. దీని కంతకూ మీరే కారకులు కావటం జరిగింది. ఇంతకన్న విచార కారణం ఏముంటుంది? నాకు మీ రాజ్యమూ వద్దు. రాజ్యసుఖాలూ వద్దు. ఇక మీరు చేయగలిగిన దేమంటే, ఇతరులకు మేలు చేయదలిస్తే, ధర్మంగా ప్రవర్తించండి. లేదా, తాటిమాను నీడలాటి

సుఖాలు కావాలంటే, ఈ పదమూడేళ్ళూ సుఖాలలో ఓలలాడండి. ఎలాగైనా అటు తరవాత కౌరవ వినాశం తప్పదు," అన్నాడు.

ఈ మాటలు విన్న ధృతరాష్ట్రుడు దడుచుకుని విదురుడితో, "విదురుడా, ద్రోణాచార్యుల మాట నిజం. నువ్వు ఇప్పుడే అరణ్యానికి వెళ్ళి పాండవులను తప్పకుండా తీసుకురా. ఒకవేళ వాళ్ళు రామంటే, సన్మానం పొంది మళ్ళీ వెళ్ళమని చెప్పు," అంటూ మనసు నిప్పులు తొక్కిన కోతిలాగా గిలగిలలాడుతుండగా, నిట్టూర్పులు వదల సాగాడు.

అప్పుడు సంజయుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, నీ కీ రాజ్యమంతా పాండురాజు గెలిచిపెట్టాడు. అతని పట్ల ఎటువంటి కృతజ్ఞతాభావమూ లేకుండా కుయుక్తితో కుట్ర పన్ని అతని కొడుకులను అడవులకు తోలేశావు. వాళ్ళు సర్వమూ వదులుకుని అడవుల పాలయ్యారు. ఇంకేమిటి నీ విచారం?" అన్నాడు.

"విచారం కాకేమిటి? ఆ పాండవులు అతిరథులూ, యుద్ధం తెలిసినవాళ్ళూ. అజేయులైన అలాటివాళ్ళతో వైరం వచ్చిన తరవాత విచారం ఉండదా?" అన్నాడు ధృతరాష్ట్రుడు.

"ఈ వైరం నువ్వు బుద్ధిపూర్వకంగా తెచ్చుకున్నదే కదా! పెద్దవాడు భీష్ముడూ, గురువైన ద్రోణుడూ, నీ మంత్రి అయిన విదురుడూ వద్దంటుంటే విన్నావు కావు. నీ కొడుక్కు బుద్ధీ లేదు, లజ్జా లేదు! ప్రాతికామిని పంపి, ఏకవస్త్ర అయి ఉన్న ద్రౌపదిని నిండుసభలోకి రప్పించి, వివస్త్రను చేసి అవమానించాడు. ఆమె ఉసురు నీ కులానికి చేటు. అది నీ కులాన్ని సర్వ నాశనం చేస్తుంది. చెట్టు చెడేనాటికి కుక్కమూతి పిందెలు పుడతాయి. వినాశ కాలం వచ్చేసరికి దేవతలు బుద్ధి నశింప జేస్తారు. కాలం ఎవరినీ కర్ర తీసుకుని నెత్తిమీద కొట్టదు. కాలం తీరేసరికి అన్యాయం న్యాయంగా కనబడుతుంది," అని సంజయుడన్నాడు.

"అవును. పుత్రమోహం చేత ఎవరు చెప్పినదీ వినక, నా కొడుకు చెయ్యమన్నది చేశాను. ఏం చేసేది? దేవుడే మమ్మల్ని కాపాడాలి!" అన్నాడు ధృతరాష్ట్రుడు.



# కారంజి చెట్లు

బొంబాయికి సమీపంలో కరంజియా అనే ఒక దీవి ఉన్నది. అక్కడ విరివిగా కనిపించే చెట్లను మరాఠీలో ఆ దీవి పేరుతోనే కారంజ్ అని పిలువసాగారు. హిందీ, గుజరాతీ భాషలలో కూడా దీనిని కారంజ్ అనే అంటారు. బెంగాలీలో కాంజీ అంటారు. తమిళంలో పాంగం, పుంగు అనీ, మలయాళంలోనూ, తెలుగులో కొన్ని ప్రాంతాలలో పుంగుచెట్టు అనీ దీనిని పిలుస్తారు. వృక్షశాస్త్రంలో దీనిని పోంగామయా పిన్నాటా అని అంటారు. మలయాళంలో దీనికి ఉన్నే అనే వేరొక పేరు కూడా ఉన్నది.

సముద్ర తీర ప్రాంతాలలో ఎక్కువగా కనిపించే ఈ చెట్లు, ఇసుక ఎక్కువగా ఉండే నదీతీరాలలోనూ, కాలువ గట్ల మీదా బాగా పెరుగుతాయి. కొమ్మలు విరబోసుకుని కిరీటంలాగా కనిపిస్తాయి. చెట్టుబెరడు గరుకుగా ఉంటుంది. ఈ చెట్లు సంవత్సరం పొడవునా పచ్చగా కనిపిస్తాయి. ఆకులు లేత పచ్చరంగులో రెమ్మకు 5,7,9 ప్రకారం ఉంటాయి. ఆకులు వెడల్పుగా, అండాకారంలో మొనదేలి ఉంటాయి. కొయ్య బీరువాలలో చెదలు పట్టకుండా ఉండటానికి ఈ కారంజి ఎండుటాకులు వాడతారు.

వీటి పువ్వులు లేత ఎరుపు, ఊదా చారలతో తెల్లగా ఉంటాయి. ఏప్రిల్-జూన్ నెలల మధ్య పూస్తాయి. తెల్లవారి చూస్తే చెట్ల కింద నేలమీద తివాచీ పరిచినట్టు పువ్వులు రాలి ఉంటాయి. కాయలు గట్టిగా రెండువైపులా మొనదేలి ఉంటాయి.

ఈ చెట్లను నీడ కోసం రోడ్లకు రెండువైపులా నాటి పెంచుతారు. ❐



మనదేశపు ఋషులు:

# అకృతవ్రణుడు

పరశురామ మహర్షికి పలువురు శిష్యులు ఉండేవారు. వారిలో గురువును సదా సర్వవేళలా అంటిపెట్టుకుని ఉండి, ఆయనకు పరిచర్యలు చేసిన ఉత్తమ శిష్యుడు అకృతవ్రణుడు.

పరశురాముడు ఒకసారి అడవి గుండా వెళుతూండగా ఒక గుహ నుంచి దీనస్వరం వినిపించింది. పరశురాముడు వెళ్ళి చూశాడు. ముని కుమారుడు ఒకడు గుహగోడకు అంటుకుపోయి విలపిస్తున్నాడు. వాడి మీదికి ఉరకడానికి ఒక పులి సిద్ధంగా ఉన్నది. వెంటనే పరశురాముడు వదిలిన బాణానికి పులి కిందపడి మరణించింది.

మరుక్షణమే పులినుంచి ఒక గంధర్వుడు ప్రత్యక్షమై పరశురాముడికి నమస్కరించి, తనకు శాప విముక్తి కలిగించినందుకు కృతజ్ఞతలు చెప్పుకుని మాయమయ్యాడు. కుర్రవాడు మునికి సాష్టాంగ నమస్కారం చేశాడు. ముని కరుణ కారణంగా గాయం లేకుండా బయటపడ్డాడు గనక, వాడికి అకృతవ్రణుడు అనే పేరు వచ్చింది! ముని వాణ్ణి ఆశీర్వదించి తన శిష్యుడిగా స్వీకరించాడు. పరశురాముడు అతనికి వేద వేదాంగాలను మాత్రమే కాకుండా, వివిధ శస్త్రాస్త్ర విద్యలను కూడా బోధించాడు.

కురువీరుడైన భీష్ముడు కూడా పరశురాముడి వద్ద విద్య నభ్యసించాడు. ఆయన ఒకప్పుడు కాశీరాజు ప్రకటించిన స్వయంవరానికి వెళ్ళి, ఎదిరించిన రాకుమారులను ఓడించి, తన తమ్ముడైన విచిత్రవీర్యుడి కోసం, కాశీరాజు కుమార్తెలయిన అంబ, అంబిక, అంబాలికలను తన రాజ్యానికి తెచ్చాడు. కాని అంబ తాను సాళ్వరాజును వరించినట్టు చెప్పడంతో, ఆమెను పంపేశాడు. అయినా, ఆమెను చేపట్టడానికి సాళ్వరాజు తిరస్కరించడంతో, ఆమెతిరిగి వచ్చి విచిత్రవీర్యుణ్ణే వివాహమాడమన్నది. కానిఆయన నిరాకరించాడు. ఆ తరవాత ఆమె తన దీనస్థితికి కారణమైన భీష్ముణ్ణే తనను వివాహమాడమన్నది. కాని తన బ్రహ్మచర్య వ్రతప్రతిజ్ఞ కారణంగా భీష్ముడు ఆమె కోర్కెను నెరవేర్చలేక పోయాడు.

భీష్ముడి మీద పగ సాధించడానికి, ఆమె పలువురు రాకుమారుల సహాయం అర్థించింది. అయినా, భీష్ముణ్ణి ఎదిరించడానికి ఎవరూ సాహసించలేదు. అంబ ఆఖరికి పరశురాముడి దగ్గరికి వెళ్ళి తన గోడు వినిపించింది. పరశురాముడు ఆమెను వెంటబెట్టుకుని, ఒకప్పటి తన శిష్యుడైన భీష్ముడి దగ్గరికి వచ్చి, ఆమెను వివాహమాడమన్నాడు. భీష్ముడు కాదనడంతో, ఆగ్రహంతో యుద్ధానికి దిగాడు.

అకృతవ్రణుడు పరశురాముడికి సారథిగా రథం నడిపాడు. కురుక్షేత్రంలో పరశురామ-భీష్ముల మధ్య చాలా రోజులు యుద్ధం జరిగింది. కాని ఒకరినొకరు జయించలేక పోయారు. ఆఖరికి నారదాది మునులూ, దేవతలూ అడ్డుపడి యుద్ధం ఆపారు. ఉభయులకూ జయాపజయాలు లేకుండా యుద్ధం ముగిసింది.

గురువు దీవెనలు పొంది, అకృతవ్రణుడు ఉత్తరోత్తరా గొప్ప ఋషిగా పేరుగాంచాడు.



# మీకు తెలుసా?

1. 'డెడ్ సీ' లోతు ఎంత?
2. ఒలింపిక్ జెండాలో భిన్నమైన రంగులలో ఏడు వలయాలున్నాయి. ఆ రంగులు ఏవి? ఆ రంగులను ఎందుకు ఎంపిక చేశారు?
3. మొక్కల పెరుగుదలను కొలిచే పరికరాన్ని ఒక భారతీయుడు కనుగొన్నాడు. ఆయన ఎవరు?
4. 1906 వసం॥లో నోబెల్ బహుమతి పొందిన ఒక విజ్ఞానవేత్త శిష్యులు ఎనిమిది మంది ఆయన తరవాత నోబెల్ బహుమతి పొందారు. అటువంటి ప్రత్యేకతను సంతరించుకున్న నోబెల్ బహుమతీ గ్రహీత ఎవరు?
5. రాజు అంధుడని రాణి కూడా తన కళ్ళకు శంతలు కట్టుకున్నది. ఆ రాజు, రాణి ఎవరు?
6. 'దేశబంధు', 'దీనబంధు' అనే బిరుదనామాలు ఎవరెవరికి ఉండేవి?
7. రోమనులు గుడ్లగూబను వినానికి చిహ్నంగా భావించేవారు. మరి ఈగలను ఎలా భావించేవారు?
8. భారత జాతీయ పతాకంలోని త్రివర్ణాలను మేడమ్ భికాయ్‌జీ కామా రూపకల్పన చేసింది. అమెరికా పతాకాన్ని రూపొందించిన మహిళ ఎవరో తెలుసా?
9. మన దేశ జాతీయ మృగంగా పులిని ఎప్పుడు స్వీకరించారు?
10. ఎగిరే పళ్ళాలను మొట్టమొదట ఎప్పుడు చూసినట్లు చెబుతారు?
11. ఇటలీకి చెందిన మొట్టమొదటి మహిళా డాక్టర్ వేరొక రంగంలో విశేష కృషి చేశారు. ఆమె పేరేమిటి?
12. జవహర్‌లాల్ నెహ్రూ జైలులో ఉన్నప్పుడే 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' (భారత దర్శనం) పుస్తకం రాశాడు. ఏ జైలులో ఉన్నప్పుడో తెలుసా?
13. 'పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా'ను మావో సే టుంగ్ ఎప్పుడు ప్రకటించాడు?
14. 'టెంపుల్ ఆఫ్ హెవెన్' (స్వర్గమందిరం) ఎక్కడ ఉన్నది?
15. అక్బర్ చక్రవర్తి రెవిన్యూశాఖ మంత్రి ఎవరు?

## సమాధానాలు

1. 395.9 మీటర్లు.
2. నీలం, పసుపుపచ్చ, ఆకుపచ్చ, ఎరుపు, నలుపు. అన్నిదేశాల పతాకాలలోనూ వీటిలో కనీసం ఏదైనా ఒక రంగు ఉంటుంది.
3. జగదీశ్ చంద్రబోస్.
4. జె.జె. థాంప్సన్.
5. మహాభారత కథలోని ధృతరాష్ట్రుడు, గాంధారి.
6. దేశబంధు సి.ఆర్.దాస్, దీనబంధు సి.ఎఫ్. ఆండ్రూస్.
7. అదృష్టానికి చిహ్నంగా.
8. ఫిలాడెల్ఫియాకు చెందిన బెట్సీరాస్.
9. 1972 నవంబర్‌లో.
10. 1947 జూన్ 24.
11. మేరియా మాంట్‌సోరీ, విద్యారంగంలో.
12. అహ్మద్‌నగర్ కోట.
13. 1941 సెప్టెంబర్ 21.
14. చైనాలోని బీజింగ్‌లో.
15. తోడర్‌మల్.

# బంగారు గడియలు - నెం.2: సమాధానాలు



1. **అంకోర్:** అంకోర్ నగరాన్ని రాజు విజయవర్మ, ఆయన వారసులు నిర్మించారు. అది 300 సంవత్సరాలు వైభవంగా వెలుగొందింది. పాలకులు, ప్రజలు దానిని వదిలిపెట్టడంతో చుట్టూ చెట్టుచేమలతో అడవి ఏర్పడింది. దాదాపు 500 సంవత్సరాల తరవాత అది హెన్రీ మౌహాట్ ద్వారా బయట పడింది. దిగువ చూపబడినది గరుడ విగ్రహం.
2. **ఎక్కడా లేదు.** దోదో పక్షి దాదాపు 200 సంవత్సరాలకు పూర్వమే నశించి పోయింది.
3. ఈ వరుసలో చూపబడిన అంకెలన్నీ 1 నుంచి మొదలయ్యే బేసి సంఖ్యల అద్దంలోని రూపాలు.
4. **తమాషా.** మహారాష్ట్ర ప్రాంతంలో ప్రసిద్ధమైన గేయనృత్యం.
5. **చేపను!** అండమాను ఆటవికులు విల్లంబులతో చేపలను వేటాడతారు.
6. **ఒక గంట తరవాత కూడా విగ్రహం నీటి ఉపరితలంలోనే ఉంటుంది.** నీటిమట్టం పెరిగినప్పుడు, దానితో పాటు పడవ కూడా పైకి లేస్తుంది.

యువరాజు ఉదయనుడి రహస్యసూత్రం: కళ్ళు తెలియని యువరాజు చేయవలసిందల్లా గుహ గోడకుడివైపును పట్టుకుని దానిని అనుసరించి వెళ్ళడమే!








# పిశాచాల వంటవాడు

రామాపురంలో వుండే శివయ్య, కలవారి ఇళ్ళల్లో పెళ్ళిళ్ళకూ, ఇతరత్రా శుభకార్యాలకూ వంటలు చేస్తూ జీవనం సాగించేవాడు. ఆయనకు ఒక్కగానొక్క కూతురు సీత. తన ఐదవ ఏటనే తల్లిని పోగొట్టుకున్న ఆమెను, ఎవరి ఇంటనైనా పని ఉన్న రోజున వెంట బెట్టుకువెళ్ళేవాడు. తండ్రి వంట చేస్తూంటే సీత చూస్తూ కూర్చునేది. ఇద్దరూ ఆ పూటకు అక్కడే భోంచేసి, రాత్రికి సరిపడా మూటగట్టుకుని ఇంటికి వచ్చేవారు. ఎక్కడా పనిలేని రోజున శివయ్యే వండి, ప్రేమగా కూతురుకు పెట్టేవాడు. ఇదే అలవాటు ఏళ్ళ తరబడి సాగి, వంట చేసే విషయంలో మహా బద్ధకంగా తయారైంది సీత.

ఇలా ఉండగా, శివయ్యకు రాముడనే వాడు తోడయ్యాడు. శివయ్యకు సీత లాగే, అతడి చెల్లెలికి రాముడు ఒక్కగా నొక్క కొడుకు. వాళ్ళది చాలా పేద కుటుంబం. అందువల్ల, శివయ్య రాముడికి తన ఇంట ఆశ్రయం ఇచ్చి, వాణ్ణి తనతోబాటు తిప్పసాగాడు. కొన్నాళ్ళు గడిచేసరికి, రాముడు కూడా వంటలన్నీ నేర్చుకుని, మేనమామను కూర్చోబెట్టి, తను వంటపనులు చేయడం ప్రారంభించాడు.

రాముడి కలుపుగోలుతనం చూసి ముచ్చటపడ్డ శివయ్య, ఒకనాడు వాడితో, "ఒరే, రాముడూ! మా సీత పుట్టగానే అది నీ పెళ్ళాం అనే అనుకున్నాం రా. మీ ఇద్దరికీ పెళ్ళి చేసేస్తినా, ఇక నాకు నిశ్చింత," అన్నాడు.

ముద్దబంతి పువ్వులా, అందంగా, కలివిడిగా వుండే సీతను అప్పటికే మనసులో ఇష్టపడుతున్న రాముడు వినయంగా తల వంచుకుంటూ, "నీ ఇష్టం, మామయ్యా!" అన్నాడు.

ఆ తర్వాత రెండు నెలలకు సీతకు రాముడితో పెళ్ళి జరిగిపోయింది. అయితే,

"లక్ష్మీగాయత్రి"



ఆ తర్వాత సంవత్సరం తిరక్కుండానే శివయ్య ఏదో జబ్బుచేసి చనిపోయాడు. దాంతో ఊళ్ళో వంటపనుల బాధ్యతతో పాటు, తండ్రిని పోగొట్టుకున్న పెళ్ళాన్ని ఓదార్చడం, ఆమెకు వండిపెట్టడం కూడా రాముడి మీదే పడ్డాయి.

భోజన ప్రియురాలైన సీత ఒక్కొక్కనాడు కంచం ముందు కూర్చుని, "ఈ వంకాయ కూర సరిగ్గా వేగలేదు. కొబ్బరిపచ్చడి బాగానే ఉంది గాని, చింతపండుకు బదులు నిమ్మ కాయ రసం పిండితే వచ్చే రుచి అద్భు తంగా వుంటుంది! అలా చెయ్యాల్సింది," అంటూ వంకలు పెట్టేది.

తను వండిపెడుతూంటే హాయిగా కూర్చుని తింటూ, అలా మాట్లాడుతున్న పెళ్ళాన్ని చూస్తే రాముడికి మండిపోయేది.

ఇలా ఉండగా, రాముడి పుట్టినరోజు వచ్చింది. ఆ ఒక్కరోజుకూ తను, తనకు ఇష్ట మైన మామిడికాయపులిహోరా, చక్రపొంగలీ చెయ్యమని అడుగుదామనుకున్నాడు. అయితే, సీత, ఆ రోజు, నిద్ర లేవడమే ఒళ్ళునొప్పులంటూ లేచి, చిన్న చిన్నపనులు చక్కబెట్టసాగింది. ఇక ఆ పరిస్థితిలో సీతను ఇబ్బంది పెట్టడం ఇష్టం లేక, 'ఎటూ రోజూ వండుతున్నది నేనే కదా! ఈ రోజు కూడా నాకిష్టమైనవి నేనే చేసుకుంటాను," అని సరిపెట్టుకున్న రాముడు, తనే పులిహోరా, చక్రపొంగలీ చేశాడు.

వాటిని తినడానికి కూర్చున్న సీత, రెంటినీ రుచి చూసి, పెదవి విరుస్తూ, "అబ్బే, రెండూ కుదరలేదు! పులిహోరలో పులుపు ఎక్కువైంది. చక్రపొంగలిలో పెసరపప్పు బద్దలు నాలుగు ఎక్కువైనాయి. చక్రపొంగలికి ప్రాణం బియ్యం, పప్పూ కలిపే తీరే! ఇది పంచ దార కలిపిన అన్నంలా వుంది!" అన్నది.

చేసుకున్నవేవో తృప్తిగా తినడానికి కూర్చున్న రాముడికి, పెళ్ళాం మాటలు పంటి కింద పటికముక్కల్లా తగిలాయి. ఏనాడూ ఎరగ నంత కోపం వచ్చింది వాడికి.

రాముడు వెంటనే కంచం ముందునుంచి ఛరున లేచి, గట్టిగా, "ఒసే, పిశాచమా! ఇన్నాళ్ళూ పోనీలే అని సహించాను. ఇక నావల్ల కాదు. నీకు వండి వార్చేకంటే, అడ వుల్లో పిశాచాలకు వండిపెట్టడం వెయ్యి రెట్లు సుఖం! ఇదిగో, ఇప్పుడే పోతున్నా. ఈ క్షణంనుంచీ నలభీమపాకం చేసుకునే మింగుతావో, పస్తులే పడుకుంటావో– నీ ఖర్మ," అంటూ అరిచి, రెప్పపాటులో చెయ్యి

కడుక్కుని, చిలక్కొయ్యకు తగిలించి వున్న చొక్కా విసురుగా లాక్కుని, వీధిలోకి వెళ్ళిపోయాడు.

ఏనాడూ ఎరగని భర్త కోపానికి బిత్తర పోయిన సీత, తేరుకుని లేచి వెళ్ళి చూసే సరికి, రాముడు వీధి మలుపు తిరిగి అదృశ్య మయ్యాడు. చేసేదేమీలేక వెనక్కు వచ్చిన సీత, తనూ చెయ్యి కడుక్కుని ఏడుస్తూ పడుకున్నది.

వెర్రికోపంతో ఇల్లు వదిలిన రాముడు కొద్దిసేపట్లోనే అడవి చేరుకున్నాడు. వాడు కొంతదూరం అడవిలో నడిచేసరికి, వెనుక నుంచి కిచకిచ మన్న శబ్దం వినిపించింది. ఈ కోతుల గొడవేమిటి అనుకుంటూ వాడు వెనుదిరిగే సరికి, రెండు పొట్టి పిశాచాలు వాడి ముందు ప్రత్యక్షమై, కిచకిచమని నవ్వుతూ, "ఏరి కోరి మా కోసం వచ్చిన వంటాయన గారికి, శాకాహార పిశాచాల స్వాగతం, సుస్వాగతం!" అన్నవి.

స్వతహాగా ధైర్యస్థుడైన రాముడు, పిశాచాలను చూసి, భయపడక, "మీకోసం రావడమేమిటి! అసలు నేను వంటలు చేస్తా నని మీకెలా తెలుసు?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు పిశాచాలు కిచకిచమని నవ్వి, "అదే మా గొప్పతనం! ఈ నాటి అర్ధ రాత్రాన, మా యజమాని కూతురు పెళ్ళి బ్రహ్మండంగా జరగబోతున్నది. ఆ పెళ్ళి వంటలు ఈసారి మార్పుకోసం, వంట పిశా చాల చేతకాక, వంటమనిషి చేత చేయించా లని మా యజమాని కోరిక. ఇప్పుడు నువ్వు మా వెనకే వస్తే, మా యజమాని దగ్గరకు తీసుకుపోతాం," అన్నాయి.



ఆ తర్వాత పిశాచాలు వాణ్ణి చీకటి పడుతున్న సమయానికి, ఒక మిట్టమీద వున్న చెట్ల గుంపుకేసి, తీసుకుపోయి, తమ యజమాని ముందు నిలబెట్టాయి. పిశాచాలు చెప్పగా, రాముడెవరో తెలుసుకున్న వాటి యజమాని, "ఇదిగో, వంటమనిషీ! ఈ పెళ్ళికి వంట బాధ్యత అంతా నీదే. వంటకాలు మగపెళ్ళివారికి నచ్చేటట్లు చేశావో, నీకు బోలెడు బహుమతులిస్తాం," అన్నది.

ఆ మాటలకు రాముడు దర్పంగా, "బహుమానాల మాటకేం గానీ, వంటకు కావలసిన సరుకులూ, పాత్రసామాన్ల మాటేమిటి?" అని ప్రశ్నించాడు.

వాడి దర్పానికీ, ఆ ప్రశ్నకూ కాస్త చిరాకు పడ్డ యజమానిపిశాచం పెళ్ళాం, "వాటికేం లోటు లేదు గానీ, పెళ్ళివిందుకు గారెలూ,




బూరెలూ చెయ్యాలి. మా పిశాచాల వంటలు నీకు తెలియవు గదా, చెబుతాను విను. మేం కందిపప్పూ, మినప్పప్పూ కలిపి బూరెలూ, కందిపప్పులో కొద్దిపాటి మెంతులు కలిపి గారెలూ వండుకుంటాం. ఆ ప్రకారం, ఆ వంటకాలను నోరూరేలా చేశావో సరేసరి! లేని పక్షంలో నిన్ను ముక్కలుగా తరిగి, మసాలా పెట్టి వండుకోవటానికి గాను, మా పొరుగున వుండే మాంసాహార పిశాచాలకు బహుమతిగా ఇస్తాను, జాగ్రత్త!" అన్నది.

ఆ మాటలతో రాముడికి తల గిర్రున తిరిగిపోయి, తొలిసారిగా వాడికి పిశాచాలంటే భయం పట్టుకున్నది. వాడు చేసేది లేక, యజమాని పిశాచం చెప్పిన ప్రకారం నానబెట్టిన మినప్పప్పూ, పచ్చి కందిపప్పూ కలిపి, రోలు అరిగిపోయేలా రుబ్బి బూరెలూ, నానబెట్టిన కందిపప్పులో సోలెడు మెంతులు కలిపి రుబ్బి గారెలూ చేసి, వాటి వాసనకే కడుపు తిప్పుతూండగా-పిశాచాలకు దూరంగా పోయి ఒక చెట్టు చాటున కూర్చున్నాడు. వాడికి చిన్న కునుకు పట్టసాగింది.

అయితే, ఇంతలో పిశాచాల పెళ్ళి సందడి ప్రారంభమైంది. మొదటిఝాము గడిచీ గడ వడంతోనే ఎక్కడినుంచో మరిన్ని పిశాచాలు వచ్చాయి. వాటి గోలతో రాముడికి నిద్రమాట అలా వుండగా, శోష వచ్చినంత పనయింది.

పెళ్ళికొడుకుపిశాచం రాముడు చేసిన వంటకాలు తింటూ, "గారెలూ, బూరెలూ చాలా బాగున్నాయి. ఎవరు చేశారు?" అంటూ ప్రశ్నించింది. యజమాని పిశాచం హుందాగా, "పెళ్ళివంట చెయ్యడం కోసమని ఒక మనిషిని పిలిపించి, వాడిచేత చేయించా," అన్నది.

పెళ్ళికొడుకుపిశాచం ఆశ్చర్యపోతూ, మరి రెండుబూరెలు తీసుకుని, "ఆ వంట మనిషిని మీ కూతురితో పాటు అరణంగా పంపండి. ఇదే నా కోరిక!" అన్నది.

యజమానిపిశాచం ఆనందంగా, "అదే మంత పెద్దకోరిక! తప్పకుండా పంపిస్తాను,"అని రాముణ్ణి తీసుకురావలసిందిగా పొట్టి పిశాచా లను ఆజ్ఞాపించింది.

అదంతా వింటున్న రాముడు నిలువెల్లా వణికిపోతూ, "ఇప్పుడేం దారి భగవంతుడా!" అనుకోగానే వాడికి, తను తరచు వెళ్ళే ఆంజనేయస్వామి గుడీ, అందులో పూజారి చదివే ఆంజనేయ దండకమూగుర్తొచ్చాయి. అయితే, వాడికి ఆ దండకంలో, 'శ్రీ ఆంజనేయం' అన్న మొదటిముక్క ఒక్కటి తప్ప ఇంకేమీ రాదు. వాడు తనకేసి

గెంతుకుంటూ వస్తున్న పొట్టి పిశాచాలకేసి కోపంగా చూసి, గట్టిగా కళ్ళు మూసుకుని చేతులు జోడిస్తూ, శ్రీ ఆంజనేయం అంటూ పొలికేక పెట్టి, అదేపనిగా 'శ్రీ ఆంజనేయం' అంటూ వల్లించసాగాడు.

అలా ఐదు నిమిషాల పాటు క్షణం కూడా ఆగకుండా వల్లించిన రాముడు, చుట్టుపక్కల అంతా నిశ్శబ్దంగా వుండడంతో కళ్ళు తెరిచి చూశాడు. దరిదాపుల ఎక్కడా పిశాచాల ఛాయలు కూడా లేవు. ఆసరికి సూర్యోదయమవుతున్నది.

రాముడు పరమానంద భరితుడై, శ్రీ ఆంజనేయం అంటూ గట్టిగా ఒక కేక పెట్టి, ఇంటిదారి పట్టాడు. బారెడు పొద్దెక్కేసరికి అడవి దాటి ఇవతలకు చేరిన రాముడు, తల వంచుకుని నడిచి వస్తున్న సీతను చూసి ఆశ్చర్యంగా, "ఎక్కడికీ ప్రయాణం?" అంటూ కేక పెట్టాడు.

భర్త గొంతు వింటూనే తలెత్తి చూసిన సీత, ఆశ్చర్యానందాలతో కన్నీళ్ళు కారుస్తూ, రాముడి దగ్గరకు వచ్చింది. వాడు, భార్యను ఓదారుస్తూ, "నేను వచ్చేశాను గదా, ఇక కళ్ళనీళ్ళు పెట్టకు. సరే, అడవికేసి వెళుతున్నావెందుకు?" అని అడిగాడు.

"నీ కోసమే! నాకు వండిపెట్టేకంటే, అడవిలో పిశాచాలకు వండడం నయమన్నావు గదా! అందుకే, అక్కడున్నావేమో చూద్దామని బైలుదేరాను," అన్నది, కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ.

ఆ మాట విని రాముడు గట్టిగా నిట్టూర్చి, "ఆ ముచ్చటా తీరిందిలే! ఆ మతిమాలిన పిశాచాలకు వంట చేయడం కన్నా, నీకు వండిపెట్టడమే కోటిరెట్లు హాయి," అన్నాడు.

సీత వెంటనే భర్త చెయ్యి పుచ్చుకుని, "ఇకనుంచి పనిలేని రోజున నేనే నీకు వండిపెడతాను. పనున్న రోజున నీతోపాటు వచ్చి సాయం చేస్తాను," అన్నది.

భార్య మాటలకు పరమానందం చెందిన రాముడు, దారిపొడుగునా పిశాచాలతో తన అనుభవాన్ని వర్ణిస్తూ, ఇల్లు చేరాడు.

అంతా విన్న సీత బెదురుగా, "ఇంకా నయం, దేవుడిదయ వల్ల అంతా సవ్యంగా జరిగింది గాని, లేకపోతేనా..." అంటూ మంగళసూత్రాన్ని కళ్ళకద్దుకున్నది.



# సమ్మయ్య తెలివి!

భువనగిరి నుంచి, రాయగిరికి వెళుతున్నాడు సమ్మయ్య. మార్గ మధ్యంలో ఉన్న అడవిలో దొంగల భయం ఎక్కువ. అందుకని వాడు నిలువెత్తుబాణాకర్ర చేతపట్టుకుని మరీ బయలుదేరాడు. వాడు అడవి మధ్యకు వెళ్ళేసరికి, దృఢకాయులైన నలుగురు దొంగలు చెట్ల చాటునుంచి వచ్చి వాణ్ణి అటకాయించారు. సమ్మయ్య ధైర్యంగా వాళ్ళమీద తిరగబడ్డాడు. జరిగిన కొట్లాటలో అటు దొంగలకూ, ఇటు సమ్మయ్యకూ కూడా బాగా దెబ్బలు తగిలాయి. చివరికి ఎలాగైతేనేం, దొంగలు సమ్మయ్యను లొంగదీసి చెట్టుకు కట్టి, వాడి దుస్తుల్లో వెతగ్గా పది రాగి కాసులు మాత్రందొరికాయి.

దానితో దొంగలనాయకుడు నిరాశగా, "అంత బాణాకర్ర చేతబట్టుకుని నడుస్తూంటే నీ దగ్గర ఎంత సొమ్ము ఉందో అనుకున్నాం, నీ దగ్గరున్నవి, ఈ ముష్టి పది రాగి కాసులే అని ముందుగా తెలుసుంటే, నీ జోలికి వచ్చే వాళ్ళమూ కాదు, నీ చేత ఇన్ని దెబ్బలు తినే వాళ్ళమూ కాదు," అన్నాడు తగిలిన దెబ్బలు బాధపెడుతూండగా.

నలుగురు దొంగల చేతిలో దెబ్బలు తినివున్న సమ్మయ్య మరింత బాధగా, "దొంగలంటే తెలివి మంతులనీ, దోచదలచిన వాడిని నిలువెల్లా వెతికి చూస్తారనీ అనుకున్నాను. మీకు కండ పుష్టి, సాహసం తప్ప తెలివితేటల్లేవు. మీరసలు నా తలపాగా సంగతే మరిచిపోయారు. నా తలపాగా సంగతే మీరు పట్టించుకోరని ముందుగా తెలిస్తే, నేనూ మీతో ఇంతగా కొట్లాడే వాడినే కాదు, మీ చేతుల్లో ఈ చావుదెబ్బలు తినేవాడినీ కాదు," అన్నాడు.

దొంగలు వెంటనే సమ్మయ్య తలపాగా విప్పి, వాడు అందులో భద్రంగా దాచిన వెండి నాణాలు దొరకపుచ్చుకున్నారు.

—వి.ఎస్. రామక్రిష్ణ






# మంచికి మంచి

ఆనందపుర మనే ఊరిలో కాంతివర్మ అనే సంపన్ను డుండేవాడు. అతనికి సంతానం లేకపోవటం తీరని బెంగగా ఉండేది.

ఆ వూరికి ఒకనాడు ఒక యోగి వచ్చాడు. అయన అస్తమానమూ సంచారం చేస్తూ ఉంటాడు. ఏ ఊళ్ళోనూ మూడు రోజుల కన్న ఉండడు. అతనిచ్చే ప్రసాదం కోసం జనం ఎగబడతారు. ఆ ప్రసాదం మహిమలో అందరికీ నమ్మకం ఉన్నది.

కాంతివర్మ ఆ యోగిని సందర్శించి, తన సంతాన హీనత గురించి చెప్పుకున్నాడు. ఆ సమయానికి పాలుతాగబోతున్న యోగి, ఆ పాలలో కొంచెం ఒక దొన్నెలో పోసి, కాంతివర్మ కిస్తూ, "ఈ పాలను నీ భార్య ఒక్కగుక్కలో తాగినట్టయితే నీ కోరిక నెర వేరుతుంది," అని చెప్పాడు.

కాంతివర్మ ఆ పాలను తీసుకు పోయి తన భార్య కిచ్చి, "దీన్ని ఒక్క గుక్కలో తాగు," అని చెప్పాడు. కాంతివర్మ భార్య ఆ దొన్నెను తాను పూజ చేసుకునే దేవుడికి నైవేద్యం పెట్టి, తీర్థం పుచ్చుకున్నట్టుగాచేతిలో పోసుకుని, కళ్ళ కద్దుకుని, రెండు పుడిసెళ్ళు చేసి తాగింది.

తరవాత ఆమె గర్భం ధరించింది. కాల క్రమాన ఆమెకు ఇద్దరు ఆడపిల్లలు కలిగారు. పిల్లలు చాలా అందంగా ఉన్నారు. కాని, వారు పాకే దశ వచ్చేసరికి, ఇద్దరికీ కూడా ఒక్కొక్క కాలు బలహీనంగా ఉన్నట్టు బయట పడింది. ఒక కాలు అవుడు కావటం చేత వాళ్ళు సరిగా నడవలేక పోయారు.

కాంతివర్మ ఎంతో ధనం ఖర్చు చేసి తన పిల్లల అవిటి కాళ్ళకు ఎన్నో చికిత్సలు చేయించాడు. కాని ఏమీ ఫలితం లేక పోయింది. పిల్లలు చూడబోతే చక్కని చుక్కలు. కాని ఇల్లు దాటి పోలేరు. తమ అవిటి నడక ఎవరైనా చూస్తారని వాళ్ళకు



సిగ్గు. మగపిల్లలైనా కుంటితనం అంత బాధించక పోను, వీళ్ళు ఆడపిల్లలయ్యారు!

అయినా కాంతివర్మ తన పిల్లలనుఎంతో ప్రేమగా పెంచుతూ వచ్చాడు.

తిరిగి పన్నెండేళ్ళకు ఆ యోగి ఆగ్రామం వచ్చాడు. కాంతివర్మ యోగిని సందర్శించి, "స్వామీ, తమ అనుగ్రహం చేత నాకు ఇద్దరు ఆడపిల్లలు కలిగారు. కాని వాళ్ళు అవిటి వాళ్ళు. వాళ్ళ భవిష్యత్తు తలుచుకుంటే భయంగా వుంది. తమరే అనుగ్రహించివాళ్ళ అవిటితనం పోగొట్టాలి," అని ప్రాధేయ పడ్డాడు.

యోగికాస్సేపు కళ్ళు మూసుకుని ఆలో చించి, "నీ భార్య నేను చెప్పినట్టు చెయ్యకపో వటం చేత ఈ చిక్కు వచ్చిపడింది. నాదగ్గర ఈ అరటి పండు తప్ప ఇంకేమీ లేదు" అని అరటిపండులో ఒక చిన్న ముక్క తుంచి తన నోట్లో వేసుకుని, మిగిలినది కాంతివర్మ కిస్తూ, "దీన్ని నీ ఇష్టం వచ్చిన మనిషి కిచ్చెయ్యి," అని, అతన్ని ఇంకేమీ చెప్ప నివ్వకుండా అక్కడి నుంచి పంపేశాడు.

కాంతివర్మ ఆ అరటిపండు తీసుకుని, దాన్ని తన కుమార్తె లిద్దరిలో ఎవరికివ్వటానికీ పాలుపోక, మనసులో గుంజాటనపడుతూ, ఇంటిదారి పట్టాడు. అవుడు ఇద్దరు పిల్ల లకూ ఉన్నదని తెలిసి యోగి ఒక్కరికే ప్రసాదం ఎందుకిచ్చాడు? ఈ ప్రసాదంతో ఒక పిల్లకే అవుడు నయమైతే రెండో పిల్ల ఎంత బాధపడుతుంది! ఇద్దరినీ సమంగా ప్రేమించుకుంటున్న తాను మాత్రం ఒకపిల్ల అవుడు పోయి, రెండో దానిది పోకపోతే ఎంతగా బాధపడవలసివస్తుంది.

ఇలా ఆలోచిస్తూ తల వంచుకుని నడు స్తున్న కాంతివర్మ ఎవరో ఏడుస్తూ ఉండటం విని తల ఎత్తి చూశాడు. ఒక బావి దగ్గర ఒక యువతి కూర్చుని ఏడుస్తున్నది. ఒక యువకుడు ఆమెను సమాధాన పరచటానికి ఏమిటో చెబుతున్నాడు. కాంతివర్మ తమ సమీపంలో ఆగటం చూసి, ఆ యువకుడు, "అయ్యా, మీరయినా ఈమెకు కాస్త బుద్ధి చెప్పండి! బావిలో పడతానంటున్నది," అని వేడుకున్నాడు.

"అసలు విషయమేమిటి?" అని కాంతి వర్మ ఆ యువకుణ్ణి అడిగాడు. యువకుడు ఇలా చెప్పాడు.

ఆ యువతికి చిన్న తనంలోనే బాలపక్ష వాతం వచ్చి ఎడమచెయ్యీ, ఎడమకాలూ పడిపోయాయి. ఆమె నెవరూ పెళ్ళాడారు

కారు. ఈ యువకుడు ఆమెనుచూసి జాలి పడి, ఆమెను పెళ్ళాడాడు. ఆ యువకుడు ధనికుడు కాడు. అతనికి రెక్కాడితే గాని డొక్కాడదు. అతను తన భార్యకు ఇంటి దగ్గిర అవసరమైన ఉపచారాలన్నీ చేసి, పని చేసుకునేటందుకు బయటికి పోతూ ఉండేవాడు.

కొంతకాలం ఇలా జరిగాక తన భర్త తన కోసం పడుతున్న కష్టాన్ని ఆమె సహించలేక పోయింది. అన్ని పనులూ అతను చేసిపెడుతూంటే తాను కదలకుండా కూర్చుని చేయించుకోవటం ఆమెకు చాలా ఘోరంగా కనబడింది. తాను ఆత్మహత్య చేసుకుంటే తనభర్త ఎక్కడైనా ఇంకొకతెను చూసి పెళ్ళి చేసుకుని సుఖపడతాడని ఆమె నిశ్చయించుకున్నది.

"ఈమెకు కాలూ, చెయ్యీ అవుడని తెలిసే నేను పెళ్ళి చేసుకున్నాను. ఈమె చచ్చిపోతే నేనూ అలాగే చచ్చిపోతాను. ఆ మాట కాస్త ఈమెకు అర్థమయ్యేట్టు మీరైనా చెప్పండి," అన్నాడా యువకుడు.

యోగి ఇచ్చిన ప్రసాదాన్ని ఆ యువతి కిచ్చి, ఆ దంపతుల కష్టాలు తొలగించాలన్న కోరిక కాంతివర్మకు తీవ్రంగా కలిగింది. అతను తన వద్ద నున్న అరటిపండు ఆమె కిచ్చి, "ముందు ఈ అరటిపండు తిను: తరవాత మీకు తగిన సలహా ఇస్తాను," అన్నాడు.

ఆమె పండు తిన్నది. ఆమెలో ఏదో పెద్ద మార్పు వచ్చినట్టయింది. ఆమె చివాల్నలేచి నిలబడి, చేతులు రెండూ ఎత్తి జోడించికాంతి వర్మకు నమస్కారం చేసింది. ఆమె భర్త పొందిన ఆశ్చర్యానికీ, ఆనందానికీ అంతు లేదు.

"మీ కష్టాలు తీరాయి. ఇక వెళ్ళి రండి," అని కాంతివర్మ వారిని సాగనంపి, తాను ఇంటి దారి పట్టాడు. తాను అనుకున్న పని నెరవేరనందుకు బాధ కలిగినా, ఒక కూతురు అవుడు సరిఅయి, రెండో దాని అవుడు అలాగే ఉండి పోవటంతో తనకు కలిగే బాధతప్పింది కదా అనీ, ఒక సంసారం తన మూలాన సుఖపడింది గదా అనీ అతను తృప్తిపడ్డాడు. కాని అతను ఇంటికి చేరుకునేసరికి తన కూతుళ్ళిద్దరూ పరిగెత్తు కుంటూ ఎదురువచ్చేసరికి కాంతి వర్మ పొందిన ఆశ్చర్యానందాలను ఎలా వర్ణించడం!



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



S.G. SESHAGIRI



S.G. SESHAGIRI

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పండెను మా ఆశల వల!

రెండవ ఫోటో : పండకపోతే బ్రతకటమెలా?

పంపినవారు : కోలపల్లి ప్రియ,
3/95, నవాబ్‌పేట, నెల్లూరు - 524 002 (ఆం.ప్ర)

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00
చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras 600 026 (India) and Published b B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 60 026 (India). Controlling Editor: NAGI REDDI.

# Let's make the world a sweeter place to live in.



I'm planting a Tulsi tree. Hope it grows into a B-I-I-G one.



Lovable, blind Chacha Kunwar. He's been my parents' guide. The least I can do is help him cross safely.



Aha! This time Dad's got the flu and Mum's told me to give him a dose of medicine.



Gangu Bai has coolly taken the day off. Leaving Radha Mausi and me in a soapy mess.



Before that rich glutton of a Raju snatches my Kaju Barfi, let me give it to poor Smita.



Naughty Timmy has got himself hurt. Now this lil' Doc will set him right.



I'm helping Uncle Rajeev with the car repairs. Though Mum said "I'll be a spanner in the works".



With Chandra, my maths teacher, numbers are fun. Time I gave her a dozen smiling roses.




Ravalgaon™

Years and years of sweet success

Avenues.RS.100.96

# టీచర్‌కి మనసౌతాయి

అప్సరా బ్యూటీ పెన్సిళ్ళు

ఎంతో నల్లగా రాస్తుంది

బాగా పదునుగా చెక్కుతుంది




1 నటరాజ్ ప్రెస్-ఫిట్ షార్పెనర్
ఉచితం, 10 అప్సరా బ్యూటీ పెన్సిళ్ళ
ప్రతి ప్యాక్‌తోనూ.

ఈ కానుక సరుకు వున్నంతవరకే
దొరుకుతుంది.

హిందూస్థాన్ పెన్సిల్స్ లిమిటెడ్
వారి నాణ్యతగల ఉత్పాదన.




బ్యూటీ

బాండెడ్ లెడ్ ★ హెచ్ బి పెన్సిళ్ళు

everest/95/HPL/74-tl R